# ప్రగతి

౧

సంపాదకులు:

శ్రీనివాస చక్రవర్తి

రా. కృష్ణమూర్తి

బు. చి. కామరాజు



కౌముదీ ప్రచురణలు

1/15 ఎ, ఆంధ్రనగరం, దక్షిణ హైదరాబాదు

## ఇందులో.... ....

# మా భాష

## శ్రీ అడివి బాపిరాజు

మాతోనే పుట్టి పెరుగుతోంది మా ఆంధ్రభాష
మా గొప్పభాష, మా తీపిభాష
మా భాషతో మేము పెరుగుతున్నాము
మా భాషలో మేము విరుగుతున్నాము:
        కరుగుతున్నాము
మా హృదయాల వేదనలు
మా గొప్ప యత్నాలు
మా సార్వభౌమ వంశాల పెరుగుటలు తరుగుటలు
మా తీయ తీయని గంభీర నినాదాలు
        ప్రళయధ్వానాలు
మా భాషే మాకు పాటలూ పద్యాలూ
        పాడి వినిపించింది, ఆడి కనిపించింది.

ఆడింది పాడిందీ, ఆకాశాల కెగిరిందీ
        లోతులకు పోయిందీ
రాగాలాపనలలో, చతురశ్ర, తిశ్రమిశ్ర గతులలో
శ్రుతులలో స్వరాలలో
భక్తి గీతాలలో, ప్రభంజన వాక్యాలలో

ప్రళయ పద్యాలలో
పాటల్లో పదాలల్లో
ఆనాటి మావాళ్ళకు
ఈనాటి మాకూ
పాడి వినిపించింది
ఆడి కనిపించింది.

మా ఆశలూ, ఆశయాలూ, యత్నాలూ, విజయాలూ
మా నిర్మాణాలూ, ధ్వంసకార్యాలూ
మా కత్తుల థళథళలూ, మా శక్తుల ఫెళఫెళలూ
మా ప్రేమలూ, మా కామాలూ
ద్వేషాలూ, వేషాలూ
శోకాలూ, మూక వేదనలూ
కల్లోలల్లా ఆకాశానకు పొంగుతూ
కెరటాలై ఫెళ్ళున కుంగుతూ
సెలయేరుల్లా ప్రవహిస్తూ
గోదావరిలా కృష్ణవేణిలా
పెన్నలా, తుంగభద్రలా
తెలివాహాలా, వరదలు పారుతూ
ఎండకాలం ఎండుతూ
మా భాషే మాకు పాడి వినిపించింది
మాకై ఆడి కనిపించింది.

శృతులను స్పష్టంగా, సత్యంగా, అద్భుతంగా,
ఆనందంగా వినిపించీ
ఇతిహాసాలను కావ్యాలుచేసీ
కథలను గాథలనుచేసీ
రసాన్ని బ్రహ్మానందంచేసీ
గాంధర్వం అమృతవాకలుకట్టి
భక్తిని పరవశింపజేసి
నృత్యం చతుర్విధాభినయాల
జగన్మోహనమైన వాచ్యాభినయాల
విశ్వాన్నే కళలదిద్ది
పదాల పద్యాల ద్విపదల
వీరగాథల వచనాల, యక్షగానాల
ఆనాటి కావ్యాల నేటి నవ్యాల
లోకం అంతా నిండిందీ నిండుతోందీ
హృదయాల కదుపుతోందీ ఆత్మను మెదుపుతోందీ
ఆనాటి మావాళ్ళకూ
ఈనాటి మాకూ
పాడి వినిపించిందీ వినిపిస్తున్నదీ
ఆడి కనిపించిందీ కనిపిస్తున్నదీ
మా భాష

మా దేశముల భాష
మా అమృత ప్రవాహాల భాష
మా పద్రుచుల భాష
మా మహా మధుర భాష
మా భాషే
మా ఆంధ్రభాషే
మా తెలుగుభాషే.
మా భాషే! మా భాషే!!

---

( తెలుగు భాషలోని తీయదనం, తెలుగు గుండెలోని వీరరక్తపు పోటు, తెలుగు హృదయంలోని వైశాల్యం, తెలుగు నడకలోని హుందాతనం 'మా భాష'లో గూడు కట్టుకున్నాయి. కవికి మాతృభాషపైగల మహదభిమానం ఈ చిరు కావ్యంలో వరవళ్ళు తొక్కుతున్నది. పఠితహృదయాలలో 'మా భాషే, మా భాషే' అని మార్మ్రోగిస్తుంది యీ భావగర్వం. — సంపాదకులు.)

# నరసన్న పాపాయి

## శ్రీ అడివి బాపిరాజు

భద్రేశ్వరం గుడియెదుట శివరాత్రి ఉత్సవంలో వాడు గుడిలోకి రాబోయాడని మా అన్నయ్య అతన్ని చావగొట్టాడు! మా అన్నయ్య అతన్ని చావగొట్టాడు!! మా అన్నయ్య అతన్ని చావగొట్టాడు!!!

నిజమే, ఆ బాలుడు హరిజనుడే! అంతమాత్రాన మా అన్నయ్య వాడిని చావగొట్టడమే! ఆ కుఱ్ఱవాడు చేసిన తప్పు? శివరాత్రినాడు భద్రేశ్వరస్వామి గుడిలోకి మా అందరితోటీ రావాలని ప్రయత్నించాడు.

మేము కోనేటిలో స్నానాలుచేసి పట్టుబట్టలు కట్టుకొని పళ్ళూ కొబ్బరికాయలూ పువ్వులూ ఆరతికర్పూరం ఊదువత్తులు మొదలయినవి పట్టుకు బయలుదేరాం. మా వూరికి భద్రేశ్వరం ఎనిమిది మైళ్ళు ఉంటుంది. రాత్రి బళ్ళు కట్టుకు బయలుదేరాం. తెల్లవారగట్లకు భద్రేశ్వరం వచ్చాం. మా రెండెడ్ల బండే మాకు డేరా అయింది. దానిచుట్టూ తెరలు కట్టుకున్నాం. చాపలు కట్టాం. వంటలకు అన్ని సరంజాములు మా అమ్మ చేపించింది. ఆ తర్వాతనే తెలతెల్లవారేసరికి కోనేరులో దిగాం.

ఆ బాలుడు మా వూరి పెద్దమాలపల్లిలో ఉండే అబ్బాయి. వాళ్ళ అయ్య మా వూళ్ళోఉన్న కరణంగారి పాలేరు.

మా అన్నయ్య వాడిని చావకొడుతూఉంటే వాడు పెట్టినగోల రాతినైనా కరిగిస్తుంది. నేను వెక్కివెక్కి ఏడ్చాను. ఆ అబ్బాయి సొమ్మసిల్లి మూర్ఛపోయాడు. నేను ముందుకు పరుగెత్తి వాడిమీద నా చెంబులోఉన్న నీళ్ళు చల్లాను. వాడికి మెలకువవచ్చి లేచి గుండె కరిగిపోయేటట్లు ఏడుస్తూ తూలుతూ నడిచిపోయాడు....

నాకు వరసన్న ఏడుపు వినిపిస్తున్నది. స్వామికి అర్చన చేయించే పూజారి మంత్రాలు వాడి ఏడుపులా ఉన్నవి. గుడిలో మ్రోగించే గంటలు వాడు ఎక్కిఎక్కి రోదిస్తున్నట్లే ఉన్నవి. నేను అప్పుడు చిన్న బిడ్డనే అయినా నాకు వరసన్నను మా అన్నయ్య కొట్టడం నన్నే కొట్టినట్లయింది. నన్నుకూడా మా అన్నయ్య కొడ్తాడేమో అనిపించింది. నేనూ ఎక్కిఎక్కి ఏడ్చాను. నాకు ఎనిమిది సంవత్సరాల ఈడు ఉంటుంది.

"ఒసే రమణా! ఎందుకే ఇంకా ఏడుస్తున్నావు?" అని మా అమ్మ కొంచెం ఘాటుగా అడిగింది.

"దానిని రెండు వేస్తే ఊరుకుంటుంది." అని మా అన్నయ్య. ఎంత కోపం? మా అన్నయ్యకు నేను ఊరికే భయపడ్డానా? వచ్చిన వేలకొలదీ జనంలో తొక్కిసలాడుతూ బయటకు వచ్చాం

వరసన్న ఏడుపు. జనకోలాహలం. డప్పులు. బూరాలు. "శివశివ శివోహం" అనే భక్తుల కేకలు నా నిశ్శబ్దం బాప్పాయి. మా అన్నయ్య నన్ను తిట్టడం. మా అమ్మ నన్ను కేకలువెయ్యడం! వరసన్న ఏడుపు. ఏడుపు! మా అన్నయ్య వాణ్ణి గుళ్ళోకి వస్తున్నాడని చావకొట్టాడు.

## ౨

వరసన్న పెద్దవాడయ్యాడు. నేనూ పెద్దదాన్నయ్యాను. నాకూ పెళ్ళయింది. వరసన్నకూ పెళ్ళయింది.

రుద్రేశ్వరం గుడి ఎదుట మా అన్నయ్య శివరాత్రి ఉత్సవంలో వాడు గుడిలోకి రాబోయాడని అతన్ని చావకొట్టాడు. అది నా పెళ్ళిలోనూ నాకు జ్ఞాపకమే! వాడికి పెళ్ళి అవుతోందంటేనూ నాకు జ్ఞాపకమే!

వరసన్న మా అత్తవారికి పెద్దపాలేరయ్యాడు ఆ ఊరికి పెద్దమాల అయ్యాడు. కాని గుడిఎదుట వాణ్ణి మా అన్నయ్య కొట్టితే వాడు ఏడ్చిన ఏడుపే

బాపు స్నేహితురాలయింది. అదే నాకూ నరసన్నకూ మధ్య ఏదో విచిత్రమైన పవిత్రమైన సంబంధం ఏర్పాటుచేసింది.

మా అన్నయ్య అతన్ని కొట్టిన సంగతి నేను మరచిపోలేదు. మా అన్నయ్యే మరిచిపోయాడు. ఆ కొట్టడం చూస్తూ ఉన్న మా అమ్మావాళ్ళు మరిచిపోయ్యారు. ఆఖరుకు నరసన్నే మరిచిపోయాడు.

“ఏమయ్యా నరసన్నా! నీ భార్య కడుపుతో ఉందట!”

“అవునండి ఖామందుగారూ!” అన్న అతని మొగం పూవులా వికసించింది.

నరసన్న ఒడ్డూ పొడుగూ అయ్యాడు. నరసన్న నల్లని రాయిచెక్కిన విగ్రహంలా మూర్తి తాల్చాడు.

నరసన్నకు చదువులేదు. కాని వాడు చెప్పిన సలహా తిమ్మరుసు సలహా!

నేనూ కాస్త చదువుకున్నాను. మా ఆయనా కాస్త చదువుకున్నారు. నరసన్న మా పాలేరు అవడానికి నేనే కారకురాలిని. అతడు మా పాలేరయినందుకు మాకు కోటివిధాల లాభమే అయింది. ఆ ఊళ్ళో (మా ఊరు "పాడు") మా పొలంలా పండే భూమేది?

నరసన్న రుద్రేశ్వరం శివరాత్రి ఉత్సవంలో గుడిలోకి వెళ్లబోతోఉంటే మా అన్నయ్య అతన్ని చావగొట్టాడు!

మాలలూ మాదిగలూ ఎన్నిసార్లు పెద్దకులాలవారిచేత దెబ్బలుతినలేదు!

మాలలూ మాదిగలూ ఎంతమంది క్రీస్టియన్ మతంలో చేరలేదు!

మాలలూ మాదిగలూ మాకు దూరంగా ఉండాలి! మేము అంటు అవుతాము. నరసన్న భార్యను ఎవరూ చూడకుండా నా దగ్గరకు రమ్మనేదాన్ని. నా తల దువ్వమనేదాన్ని. రత్తాలు మొదట నవ్వేసింది. తర్వాత నా బ్రతిమాలడాలూ నా కోపపడడాలవల్లా భయపడుతూ ఒప్పుకొని నాకు తలదువ్వింది. నా ఒళ్ళు ఝల్లుమంది. నరసన్న రుద్రేశ్వరం గుడిలోకి వెళ్లినట్లయింది. గుడిలోకి వెళ్లినా వెళ్లని నేను! గుడిలోకి వెళ్లబోయి మా అన్నయ్యచేత దెబ్బలుతిన్న

నరసన్న! నరసన్న భార్య నాకు తలదువ్వింది. నేను నరసన్న భార్య రత్తాలు తలదువ్వాను!

## 3

ఓట్లరోజులు. కాంగ్రెసువారికీ కమ్యూనిస్టులకూ పోటీ.

మాల మాదిగలలో — వాళ్ళని హరిజనులంటారు — కాంగ్రెసువాళ్ళనీ కమ్యూనిస్టులనీ ఏవో ఫెడరేషననీ (ఢిల్లీ పార్టీ అట) ఈ ముగ్గురికీ పోటీ!

మా ఆయన నరసన్నను పోటీ చేయమన్నారు. ఆయన కాంగ్రెసువారు. నరసన్న చిన్నతనంలో చదవలేదు. కాని మావారే రోజూ నరసన్నకు చదువు చెప్పారు. ఆతనికి వచ్చిన చదువు ఎంతో పెద్దది. చంద్రేశ్వరుని గుడిఎదుట మా అన్నయ్య కొట్టిన దెబ్బలు ఆతనికి ఓనమాలు.

ఎంతమంది హరిజనులు గుళ్లఎదుట, బజారులలో అంగళ్లవీధిలో పొలాలలో దెబ్బలు తినటంలేదు?

వాళ్ళు ఏ దేవుణ్ణి చూడగలరు? వెంకటేశ్వరుడు, చిదంబరస్వామి, రామలింగేశ్వరుడు, శ్రీరంగశాయి వాళ్ళకు కనబడతారా? మా చంద్రేశ్వరుడే నరసన్నకు కనబడలేదు.

నరసన్న భార్య కడుపుతో ఉంది! నరసన్నకు కొడుకుపుడతాడా కూతురా? ఆ పాపాయికి చంద్రేశ్వరుడు కనబడడు.

"రత్తాలూ! చదువుచెప్తా చదువుకోవూ?" అన్నాను.

"నాకు చదువెందుకంటీ భామ్మదుగోరూ!" అన్నది రత్తాలు పకపక నవ్వుతూ! నరసన్న మాకు పాలేరయిన కొద్దిరోజులయినాక రత్తాలుతో అలా అన్నాను. అంతటితో వదిలానా? రత్తాలుచేత వీరవల్లిక చదివించాను.

నాకు బాగా చదువు చెప్పించారు మావాళ్ళు. ఇంటిదగ్గిరే. ఇంగ్లీషూ చదివా! మావారూ ఏదో బందరువెళ్ళి ఇంటరుమీడియేటు ఫేలయివచ్చి వ్యవసాయం పెట్టారు.

ఆయన "మన నరసన్న హరిజనుడు కదా! ఎన్ని శతాబ్దాలనుంచి వాళ్ళు అలా బాధపడుతున్నారూ! వాళ్ళు మనుష్యులు కారనా మనవాళ్ళు రవణా!" అని నన్ను దగ్గరకుచేర్చి ఏదో తనలో అనుకున్నట్టుగా అన్నాడు.

"నరసన్నను మా అన్నయ్య కొట్టాడండీ!"

"ఎప్పుడూ!" ఆయన ఆసక్తి ఎంతో మూర్తి తాల్చింది.

"చిన్నతనంలోనండీ! రుద్రేశ్వరస్వామి గుళ్ళోకి రాబోయాడు. మా అన్నయ్య వాణ్ణిపగును మా న్నయ్య చావగొట్టాడు!" చిన్ననాటి ఆ దృశ్యం అంతా జ్ఞాపకంవచ్చి నాకూ కళ్ళనీళ్ళు తిరిగాయి

మావారు నన్ను తమ హృదయానికి పొదివికొని, "నీ హృదయం నవనీతం రవణా!" అన్నారు. ఆయన ముద్దులు నాకు గాఢమైన ఆనందమూ, ఎంతో సిగ్గూ కలిగిస్తాయి.

"నరసన్న ధావ్యప తలదువ్వాడు!" నా కళ్ళల్లో భయమూ, ఏమంటారు ఇక అన్న అల్లరితనమూ రెండూ నర్తించాయి.

ఇక నన్ను మావారు తన కౌగిలిలో నలిపివేశారు. నా రవికముడి వీడి పోయినా, నాకు సిగ్గు పొంగుకువచ్చినా ఆయనకేమీ! అల్లరె ట్బాయి.

"రత్తాలు పాపాయి నెత్తుకుంటుంది!" ఆయన కళ్ళు నా కళ్ళల్లోకి అతి గాఢంగా చూచాయి.

నా కంటిరెప్పలు అరమూతలుగా వాలినవి.

"ఆ పాపాయి రుద్రేశ్వరంగుడిలోకి వెళ్తాడాఅండీ?"

"రుద్రేశ్వరమే! కాశీ విశ్వేశ్వరమే!"

"ఆ పాపాయిని మా అన్నయ్యలాంటివారు ఎవ్వరూ కొట్టరుకదాండీ" నా గుండె దడదడలాడింది.



రత్తాలు పురిటికి కష్టం అయింది. అంత బండలాంటి నరసన్నా ఒకటే గోల!

మావారు పెద్ద డాక్టర్ని తీసుకువచ్చారు.

రత్తాల్ని వాళ్ల గూడెంలో గుడిసెనుంచి మా ఇంటికి తీసుకువచ్చారు. మా దంపుళ్లగది పురిటిగది అయింది.

డాక్టరుగారు మూడు గంటలు కష్టపడ్డారు. నరసన్న కూతురు ప్రపంచ రంగంలో ప్రవేశించి "కేరు" మంది.

నేను లోపలికి పరుగెత్తాను. సిద్దిలా చేతులూ కాళ్ళూ ఆడిస్తూ అల్లరి చేస్తూంది ఆ పాపాయి.

ఇంకో హరిజన పాపాయి ప్రపంచంలోకి వచ్చింది. అదీ విసిరేసినట్లు ఊరిబయట! దానికీ చింపిబట్టలు! దానికీ తల దువ్వుకోడానికి నూనె ఉండదు! దానికీ చదువు ఉండదు! దానికి కడుపు నిండా తినడానికి తిండి ఉండదు! అదీ రుద్రేశ్వరం గుడిఎదుట గుళ్ళోకి వెళ్ళబోయి ఏ మా అన్నయ్యవల్లనో తన్నులు తినాలి.

నాకు దడదడఎత్తి ముచ్చెమటలు పోశాయి. నరసన్నను మా అన్నయ్య రుద్రేశ్వరం దేవాలయంఎదుట శివరాత్రినాడు చావగొట్టాడుకాదూ!

ఆ హరిజన పాపాయీ వాళ్ల అమ్మా నీళ్ళు పోసుకొని వాళ్ళ గూడెం వెళ్ళిపోయారు. చిట్టి కృష్ణునిలా తయారయింది ఆ చిట్టిపాప. పదిహేను రోజులలో ఉంగరాల జుట్టు. అల్లనేరేడు పండులాంటి ముక్కు. నల్ల దొండపండు దాని పెదవులు. గవ్వలలాంటి వేళ్ళు. ఆ బొజ్జ, ఆ చిన్న కాళ్ళు, ఆ చిన్నారి చేతులు అందాలు ఒలకపోసుకుంటూ నులకమంచంమీద దొర్లడమే! నేనూ మాఆయనా రాత్రిళ్ళప్పుడు నరసన్నఇంటికి పోయి రత్తాలునీ, పాపాయినీ చూచి వచ్చేవాళ్లం!

నా చీరలూ, దుప్పట్లూ దొళ్లదోపిడీ ఇచ్చాను. ఆ చిన్న పాపాయికి చిట్టి చొక్కాలు ఎన్నో కుట్టిఇచ్చాను. ఆ ముద్దుపాపను చూసినప్పుడల్లా మా ఆయన చిన్ని పాపడై నాకు కన్పించేవారు. నా రవికజేబులు పిక్కటిల్లేవి.



ఊళ్ళో వాళ్ళు మేము కులం నాశంచేశామని తిట్టుకుంటున్నారట. రాముల వారిలా ఆజానుబాహువులు కలవారూ, అందమైనవారూ, బంగారంఛాయ కల వారూ, సాధుమూర్తి అయిన మావారంటే అందరికీ భయమూ, భక్తీ! అయినా మమ్మల్ని అందరూ తిట్టేవారు.

వాళ్ళంతా రుద్రేశ్వర దేవాలయంలోకి నరసన్నవంటి హరిజన బాలకులు వస్తే చావగొట్టే జాతివాళ్ళు! మా అన్నయ్య నరసన్నను ఒక శివరాత్రినాడు చావకొట్టాడు. మా అన్నయ్య మా ఇంటికి మేం నరసన్నభార్యను పురిటికి తీసుకువచ్చినప్పటినుండీ మా ఇంటికి రావడం మానివేశాడు. నరసన్నే నాకు అన్న! "అవును రవణా! దేశం పల్లికకుపున బుట్టిన అతడే నీకు అన్న! అతడే మనకింత తిండి పెడుతున్నాడు!" అని వెన్నెలలాంటి చిరునవ్వు నవ్వుతూ మా ఆయన అన్నారు.

మావారు భగవంతులే!

నరసన్న ఎన్నికలలో నెగ్గాడు. చెన్నపట్టం శాసనసభకు సభ్యుడట!

ఆ రోజు మావారు కాంగ్రెసు నాయకులకూ ఊళ్ళవారందరికీ విందు చేశారు. నరసన్న మావారిపక్కనే కూర్చున్నాడు విందులో.

మా నరసన్న. నరసన్నగారు సభ్యుడు. ఇప్పుడూ మా అన్నయ్య నరస న్నను కొడతాడా రుద్రేశ్వరుల గుడిఎదుట! ఏమో! మా అన్నయ్య ఎంతకైనా తగును!

నరసన్నకు మా దంపుళ్ళసావిడి అయిదువందల రూపాయలుపెట్టి చక్కని ఇల్లులా సిద్ధంచేసి మావారు అందులో ప్రవేశించబెట్టారు. ఇంక మా స్థితి! నాకు నెంసన్న పాపాయి అప్పగారాలు.

నేనూ, నరసన్నభార్య రత్తాలూ—రత్నమ్మా. ఖద్దరు వడకడం ప్రారం భించాము. మావారు ఎప్పటినుంచో ఖద్దరు కడుతున్నారు. ఇప్పుడు నరసయ్య అన్నా రత్నం మరదలూ మేనకోడలు భరతాంబా అందరూ ఖద్దరు కడుతున్నాం.

నరసయ్య అన్నా. ఆనాటి నుంచీ తీవ్రంగా ఉంటూ ఉన్నాడు. తీవ్రంగా జట్లు కట్టుకుంటున్నాడు. నరసన్నకు రామేశ్వర దేవాలయం ఎదుట మా అన్నయ్య కొట్టిన దెబ్బలూ, నరసన్న ఏడుపూ ఆతనికి జ్ఞాపకమున్నాయి!

భరతదేశంలోని హరిజనులందరూ రామేశ్వర దేవాలయం ఎదుట మా అన్నయ్యచేత దెబ్బలుతినాలా?

భరతదేశంలోని హరిజనులందరూ ఇంత తెలివీ. ఇంత జట్టూ సంపాదించుకోవాలంటే నరసన్నలు కావాలా?

౬

ఇంతకూ మా నరసమ్మగారి పాపాయిని నేనే పెంచడం. దొంగతల్లి, పిల్లలులేనివాళ్ళు ఇంకొకళ్ళపాపని తెచ్చుకు పెంచుకుంటే, పిల్లలు కలుగుతారంటారు. భరతాన్ని నాదగ్గిరే, నన్ను "అత్తా!" అంటుంది. నా దగ్గిర పండుకొనే నిద్రపోతే ఓ రాత్రివేళ వాళ్ళమ్మవచ్చి తీసుకుపోయేది.

ఓ రోజున ఆ పెంకి భరతం అల్లరిచేసింది నా దగ్గిర పడుకుని. నిద్రపోయి రవికపిన్ను ఊడిపోయినా బంగారు సిగ్గులు, పాలబంగారపు కలశాలు, కి[illegible]పు ఉబుకులు. చిన్నబిడ్డ పుణుకులు పడగని, పనికిరాని వట్టి అందాలు భరతాన్ని నోటితో అందిపుచ్చుకుని పట్టి మొనలు పుణకడం ప్రారంభించింది. నాకూ నిద్రపట్టింది కాబోలు! వళ్ళు ఝల్లుమని మేనెల్లా తీపులు ప్రవహించి ఆనందం ముంచెత్తి ఎవరో బంగారు పాపాయి నా గర్భం పండించి నా పాలు పుణుకుతున్నట్లయి మెలకువ వచ్చింది.

భరతం కొంటెపాప నిద్రలో పుణుకుమని వట్టి వట్టి పాలు తాగుతున్నది.

అవి అల్లరిదానా అని సిగ్గుపడి మా ఆయన నిద్రపోతూ ఉండటంచూచి, నెమ్మదించుకొని, లిబ్బెసలాంటి భరతాన్ని పిరుదులపై రెండు చిన్న దెబ్బలు తగిలించి వాళ్ళ అమ్మని పిలిచి భరతాన్ని అందిచ్చాను.

అక్కడినుంచి రోజూ కలలే, రెండు నెలలకు నాకు నెల తప్పింది. నాయన్నా! నా ఫలకం నాకు వరమిచ్చింది.

ఇంక మా రత్తాలు — రత్నం సంతోషం ఇంతా అంతా! మా ఆయన నన్ను పూజించారంటే, వారు పదహారుకళలం సంభ్రమలయ్యారు.

తొమ్మిది నెలలలో వెన్నెల ముద్దకట్టి నాకు ఓ పాపాయి ప్రత్యక్షమైంది.

“ఆసి బంగారుతల్లీ! అచ్చంగా తండ్రిపోలిక, వదినగారూ!” అన్నది రత్నం పాపాయికి నీరుపోస్తూ!

ఈ నా కన్నతల్లి శాంతాంబ మరదలు మావారి ప్రేమమూర్తి కట్టిన వర లక్ష్మి! నరసన్న మా అన్నయ్యచేత దెబ్బలుతిన్నప్పుడు ఏడ్చిన ఏడుపులోఉన్న కరుణరసంనిండిన కలశం! వచ్చింది. ఆమెకు మేము “పూర్ణ స్వరాజ్య లక్ష్మి” అని పేరు పెట్టుకున్నాం.

---

( గాంధీమహాత్ముని హరిజనోద్యమం ఆసేతుహిమాచలపర్యంతం ఒక ఊపు ఊపింది. ఆ ఊపులో కథకుని హృదయం ద్రవించి ఈ కథ రూపం తాల్చింది. అన్న హరిజనబాలుని చావమోదాడు; చెల్లెలి “గుండె కరిగిపోయింది.” ఆ హరిజనబాలుడు తండ్రి అయ్యాడు. “చెల్లెలు” ఆ హరిజన యువకుని తనయను సాకింది. ఆ హరిజనబాలికయే “చెల్లెలు” మాతృదేవత కావడానికి దోహదమిచ్చింది. “చెల్లెలి” భర్త నరసన్న పాపాయికి యిల్లు కట్టించియిచ్చి అగ్రకులాలవారి పాతకానికి పరిహారం చేశాడు. ఈవిధంగా హరిజన సమస్యా పరిష్కారం సాధించారు కథకులు. కథాకల్పన, గమనం అతి సున్నితస్థాయిలో నడిచాయి. సిద్ధహస్తుడు బాపిరాజుగారు! — సంపాదకుడు.)

# లోపలి చూపుల లోతులు

విశ్వం

---

## నా [illegible] గీతిక

నా అంతరాలను మీకు చూపించలేను
నేనేకాదు ఎవరూకూడా.
అదో వ్యక్తావ్యక్తం
అదో సంధ్యా సత్యం
అదో అజ్ఞాతభూమి.
నాకే దాని డొంకతిరుగుళ్ళు తెలీవు!
నాకే దాని అంతువులు బోధపడవు
నాకే దాని వెలుగులు కనిపించవు
పాశవం కనబడుతూంటుంది;
రాక్షసం తొంగిచూస్తూంటుంది
పిశాచాలు వికటాట్టహాసాలు చేస్తూంటాయి.
అంతలోనే అందులో
అనిర్వచనీయత్వం
అంతలోనే అనంతత్వం
అంతలోనే అనాథత్వం
అమేయత్వం అవ్యయత్వం
తొలకరించి మొలకలెత్తి
పల్లవించినా అద్భుతంకాదు.

ఆకాశ మందుకోవాలనే ఆకాంక్ష
అమరత్వం చెందాలనే ఆపేక్ష
ఆనందస్వరూపిణి కావాలనే ఆవేదన
అంతటా నేనే నిండాలనే ఆసక్తి
        అన్నీ పెనవేసుకొని బయలుదేరొచ్చు.
అక్కడపోయే అమ్మాయిని
అమాంతంగా నాలో
అంతర్వాహిని చేసుకోవాలనుకోవచ్చు
అలా కనిపించే ఉద్యానాన్ని
        శ్మశానం చేయ నుంకించవచ్చు.
అందలా లెక్కాలనేకాదు
        చేయాలనీ అనుకుంటాను.
అప్సరో లోకాన్నంతా కరిగించి
పోతబోసి బొమ్మగాచేసి
భూస్థాపితంచేసి
పుటం పెట్టాలనీ బుద్ధిపుట్టొచ్చు,
ఆడజాతినే స్వరూపనాశనంచేసి
అంతా మగవాళ్ళే అయితే ...

... ... ...

దారినిపోయే బిచ్చగత్తెనుచూచి
పారిపోయే దయను చిక్కబట్టుకొని
దమ్మిడీకోసం జేబులు తడవొచ్చు
తమ సర్వస్వమైన తమ శక్తినిచ్చి

తగినకూలి యివ్వకుంటే తన్నడానికి పోవచ్చు
ప్రజాభిప్రాయం త్రోక్కిపట్టి
నిజాన్ని నీచంచేసి
ఖజానాలు నింపుకోనే
నీతులు చెప్పవచ్చు

దరిద్రం, నిరుద్యోగం, పరాజ్ఞా పీడన
పరారీకావడం మంచిదే ననిపించినా
ధర్మకర్తృత్వంకోసం
తంటాలుపడితే, తప్పేమనిపిస్తుంది.

... ... ...

కళలూ గిళలూ
సౌందర్యం బాంధవ్యం
కరుడుగట్టిన మాధుర్యం
అన్నీ పెట్టెలో పెట్టుకొని
బీగం వేయాలనుకుంటాను.

నాకే అన్నీ కావాలి;
నాకే అన్నీ ఉండాలి;
నాకే నాకే, అంతేకాదు,
ఇంకొక్కరికి ఉండకూడదుకూడా.

అయినా
నేను దయానిధిననీ
ధర్మపరుణ్ణనీ అనిపించుకోవాలి

ఓడివాళ్ళే లేకపోతే
దానమెవ్వరికి ?
పేదా సాదా ఉండాలిసిందే.
కాలు కాలే, చేయి చేయే, తల తలే
కానీ నేనుమట్టుకెప్పుడూ
తలగానే ఉండాలి తప్పదు.
తత్త్వశాస్త్రాల కేముంది ?
నా తత్త్వం మీ నెత్తిపై రుద్దుతాను.
అదేముందిలెండి, నేను ధనస్వామిని
ఆహాఁ – కాదుబాబూ
ఆ ధనమంతా మీదే
ఏదో లెక్కలు చూస్తూంటాను నేను
అక్షరాలు రానివారి కప్పగిస్తే ఎలా ?
పెట్టినందుకు పుట్టిందే సాక్షి !
కర్మండీ కర్మ –
మరికాస్త సవరణ
నా సంగతిలో కర్మంటే నమ్మకంలేదు,
కర్మంటే నా సంగతిలో నమ్మకం లేనేలేదు.
మీరంతా లేచి కేక వేసుకుంటూ
బజార్లలో ఊరేగితే
మన కర్మనుకొని ఊరుకోను.
పోలీసులకు చెబుతాను,
అధికార్లకు లంచాలిస్తాను,

లాఠీచార్జీ చేయిస్తాను,
పొడిపిస్తాను, కాల్పిస్తాను,
డొక్క చీల్చేస్తాను.

అల్లరిని రానిస్తానా ?
పోనీ అడుక్కుంటే యేదో యివ్వనంటుంటివీ ?

## మరీ చక్రం తిరిగింది

నిజమే ప్రభుత్వ మందరిదీ.
ఓట్లందరివీ,
వ్యాపారంలో స్వేచ్ఛ ఉండాలి.
అంత చాలదూ మీ పీక నులమడా నికి
నేను భూస్వామిని ధనస్వామిని
ఇంపీరియలిస్టును ఫాసిస్టును
అప్పుడప్పుడూ సోషలిస్టును కూడా
ఇంకా యేమైనా అవుతాను
ఏమైనా చెబుతాను
అంతూనా వ్యాపారం
నా చేతుంటేసరి,
నా తలంతా చదువుతూ పోతున్నాను
ఈ విపరీతాలన్నీ మీరు రికార్డు చేయకండి
లోపలి చూపు మంచిది కాదు,
నా బాహ్యస్వరూపం కావాలా

అంతర్జాతీయ అనాథ రక్షకసంఘ
వార్షికోత్సవానికి రండి
అధ్యక్షోపన్యాసం మనదే.
పత్రికల్లో వేయండి
పంచిపెట్టండి
చెక్కు! కావలిస్తే
పంపిస్తాను,
సమస్కారం.

---

(మానవ మేధకు "వ్యక్తావ్యక్తమై" దొంకతిరుగుళ్ళతో నిండిన మానవ హృదయంలోని లోతులు చిత్రించ సమకట్టాడీ యువకవి. మానవ హృదయంలో "పాశవం, రాక్షసం, వికటాట్టహాసా"లే కాక "అనంతత్వం, అమేయత్వం, అవ్యయత్వా"లు పల్లవించడంకూడా దర్శించి చిత్రించాడు. మానవుడు తన స్వార్థాన్ని కప్పిపుచ్చుకోవడానికి పన్నే దానాలు, కర్మవాదం, రాజకీయ "ఇజం"లు, దొంగవేషాలు తరిచి చూపాడు. ఈ గీతికలో రకరకాల పోకడలు, పదం పదంలో వ్యంగ్యం, కవికి మనస్తత్వశాస్త్రంలో, రాజకీయ శాస్త్రంలో గల పరిజ్ఞానం సువ్యక్తమవుతాయి. ఆధునిక గీతికాసాహిత్యంలో యీ గీతిక వెలలేని మణి. పాఠకుల కెన్నో ఆలోచనలను రేకెత్తిస్తుందీ గీతిక.

— సంపాదకులు.)

# జ్వాలా తోరణం

## ఆంగీరస్

స్రగియం యది జీవితాపహా
హృదయే కింవిహితా న హంతి మాం
విషమప్యమృతం క్వచిద్భవే
దమృతంవా విష మీశ్వరేచ్ఛయా.

శిఖివర్తునికి ఈ పాఠం ముందుకు సాగడంలేదు.

"విషమప్యమృతం క్వచిద్భవే దమృతంవా విషమీశ్వరేచ్ఛయా" అనే శ్లోక పాదాలుమాత్రం అడవిలో ఆర్తనాదం ప్రతిధ్వనించేట్లుగా సుళ్లు తిరుగుతోంది అతడి చెవిలో. అతడి నోటివెంటవచ్చే ఏ శబ్దమయినా ఈ శ్లోకంగానే వినపడుతోంది.

ముందరవుండే గ్రంథం ఎక్కడికో కదులుతూవున్నట్లుగా కనబడుతోంది. అతడు చేతులలోకిఎత్తి దాన్ని పట్టుకున్నాడు. ముందు శ్లోకం కోసం కళ్ళు తడుముతున్నాయి. కాని అక్షరాలలో కదలిక పుట్టి ఒకదానివెంట ఒకటి పరుగిడసాగాయి.

పంక్తులన్నీ చెరిగి మినుముల రాశిలాగ ఒకచోటికి కుప్పగా చేరాయి. ఆ కుప్పలోంచి అయిదు, ఆరేసి అక్షరాలు ఇవతలకొచ్చి ఒకదాని నానుకొని ఇంకొకటి నక్షత్రాకారంగా నిలుస్తున్నాయి. ఆ నక్షత్రాలు కూడా మళ్ళీ కదిలి ఒకదాన్నింకొకటి వెన్నంటి ప్రవాహం కట్టాయి.

అది నీలోత్పలదామం. కాదు, ఆకారం మారింది. పాలవెల్లికి పక్కనుండే కాలమేఘం! ఉహుఁ, నల్లత్రాచుపాము.

శిఖివర్తుడు పాము బుసలాంటి ఒక నిట్టూర్పు విడిచాడు. కాలమేఘం కమ్మిన ఇంద్రద్యుమ్న రాశిలాగ కాంతి తప్పాడు. అతడి కళ్ళలోంచి చీకటి చిత్రాలు నీలోత్పలదామాలు క్రుమ్మరించాయి.

౨

ఈ చదువు తనకు రుచించడంలేదు. ఎందుకు? సహాధ్యాయులతో చదువులో, ఆటల్లో, అక్షరముష్టికా కథనం, ప్రతిమాల, సంపాఠ్యం మొదలైన సాహిత్యగోష్ఠుల్లో పందాలువేసి ఆడుతూ, పాడుతూ ఎందుకు చదవకూడదు?

మూలదేవుడూ తనూ ఒకర్ని మించాలని ఇంకొకరు పట్టుదలతో పందాలు వెగ్గడం చూసి రాజశేఖరోపాధ్యాయులవారు సంతోషించేవారు. పెంకిపిల్ల కౌముదికూడా వారితో పందెం వేయడానికి అర్థంకాకపోయినా కౌముదిని అంతా కంఠస్థం చేస్తానంది.

నాయనగారు మళ్ళీ పాఠశాలకు పంపించకూడదూ? ఈ అధ్యయనం తన తల తినేస్తోంది. అధ్యయనం లేందే సాహిత్యం నిరర్థకమట! పోనీ అధ్యయనం నాయనగారిదగ్గరే నేర్చుకోవచ్చును.

రాజశేఖరభట్టారకులు జైనులు. వారికి వేదంరాదు. వారికే వేదంవస్తే ఎంత బాగుండేది! తనూ మూలదేవుడూ ఒకచోటే చదువుకొనేవారు. అధ్యయనం నాయనగారు ఎలాగా చెపుతున్నారు. ఈ సాహిత్యానికేనా అక్కడికి పంపడం ఎందుకుమానేశారు? అదికూడా నాయనగారే చెప్పాలా? ఏమో! అడుగుతే నాయనగారివి? అమ్మో! ఒద్దు.

రుద్రదేవభట్టారకుల రూపం శిఖిదత్తుని మనోవీధిలో గోచరించగానే ఆతడి భావాలు చండవాయువుకి అర్కతూలంలా ఎగిరిపోయాయి.

3

మూలదేవుడు హేమచంద్రసూరి త్రిషష్టి శలాకపురుష చరిత్రనంతా కష్టపడి పవిత్రంగా రాశాడు. అంతా ముద్దులు మూటకడుతోవుంది. జినప్రభసూరి గ్రంథాలన్నిటికీ పవిత్రంగా ప్రతులు తీశాడు.

ఈ తాటాకులకంటె ఆ కాగిత పత్రాలు (కాగితాలు) ఎంతబాగుంటాయి? వాటిని కావలసినంత సులభంగా గ్రహించవచ్చును. తాటాకులపై గంటాన్ని గిరగిర తిప్పేకంటే ఆ పత్రాలపై [illegible] ముద్దొచ్చే అక్షరాలు రాయ వచ్చును.

నాయనగారు ఒప్పుకోరుగా! కాగితపత్రాలు రాయడానికేనా పనికిరావు. మన వాఙ్మయమంతా తాళపత్రస్థితమై వుండాలి! తప్పనిసరి అయితే రాగి పత్రాలమీద వుండవచ్చును భూర్జపత్రాలో? అవి గొడుగులకేకాని మనకు పనికిరావట! వాటిపైనగల గ్రంథాల్ని దాక్షిణాత్యులు పఠించకూడదట!

చిత్రాలా! చిత్రాలపేరువింటే నాయనగారు కాలరుద్రులైపోతారు. మూల దేవుడు ప్రతితీసిన గ్రంథాలుచూసి రాజశేఖరోపాధ్యాయులవారి నయనాల్లో జ్యోత్స్నలు వెల్లివిరిశాయి. త్రిషష్టి శలాక పురుషచరిత్రలోని కొన్ని చిత్రాలు తను గీసినవేగా! అందులో ఆదీశ్వరుల చిత్రాన్ని చూసి రాజశేఖరోపాధ్యాయుల వారు విశేష్టులయ్యారు ఒక్క క్షణమాత్రం.

అయితేనేం? ఆ గ్రంథం మూలదేవుడిది. అటువంటి గ్రంథం తన గృహపరిసరాలకే రాకూడదు.

కౌముది పిచ్చిపిల్ల. తన పత్రికాసముద్గకం మూలదేవుడు వుపయోగిస్తే ఊరుకోదు. తానుకూడా జైనుడే అయితే ఎంతబాగుండేది! జైనులు బ్రాహ్మ ణులంత గొప్పవారా?

ఇంతకీ చిత్రాలుగీస్తే తప్పేమిటి? నాయనగారిని అడుగుతే? అమ్మో! వద్దు!!

తండ్రిని తలుచుకోగానే శిఖిదత్తుని భావాలన్నీ కాలి బూడిద ఐపోయాయి.

౪

ప్రాంగణ వితర్దికమీద కూర్చుని శ్రీతాళపత్రాలకి ఈనెలు తీస్తున్నారు శిఖి దత్తుడు. ఎడమపాయలను వేరుగానూ కుడిపాయలను వేరుగానూ తీసిపెట్టి

నాడు. ఎడమపాయలను రెండువేపులా కత్తిరించి రెండేసి వితస్తులుపొడవుకల సమాన ఖండాల్ని ఏరిపెట్టాడు.

శిఖిదత్తుని తండ్రి రుద్రదేవ భట్టారకులు ఉత్తరరామచరిత్ర మేలు ప్రతి రాయమని నియమించారు శిఖిదత్తునికి.

శిఖిదత్తుని అధ్యయన విముఖత్వము, సాహిత్య సుముఖత్వము ఆయన కనిపెట్టకపోలేదు. శిఖిదత్తుడు ముత్యాలకోవలాగ రాయగలడు. శ్రీతాళపత్రాల మీద పందెమువేసి 36 పంక్తులతో పెద్ద గ్రంథము రాయగలడు.

అయితే కొడుకు చిత్రకళాభిరతికూడా తెలుసును రుద్రదేవ భట్టారకులకు. కొడుకును ఆ మార్గంనుంచి తప్పించడానికి ప్రయత్నంచేస్తున్నాడు.

రాజశేఖరోపాధ్యాయులవద్ద చదువు మానిపించడానికి కారణం ఇదే. లేకపోతే సాహిత్యంఅంతా రాజశేఖరోపాధ్యాయులవద్దా, నిరుక్తం పూర్వ మీమాంసా తనూ చెప్పి శిఖిదత్తుని సర్వశాస్త్రపారగుణ్ణి చేద్దామనుకున్నాడు. కాని శిఖిదత్తుడు క్రమంగా బౌద్ధుడవడం ప్రారంభించాడు.

మండల విద్వత్పరిషత్తులో అగ్రగణ్యుడైన తన కొడుకు చిత్రకారుడని తెలిస్తే శ్రోత్రియలోకంలో తన కెంతఅవమానం? ఇవాళ చిత్రకారుడయ్యాడు, రేపు నాట్యంకూడా నేర్చుకుంటాడు. వర్తికలూ వర్ణాలూ చేసుకుంటూనే వృక్ష యుర్వేదం, ధాతువాదం నేర్చుకుంటాడు. నేర్చుకునేదేమిటి? అది చిత్రకళతో పాటే అబ్బుతుంది.

కళోన్మాదం ముదరకూడదు. ముదిరిందంటే ఇంక దానికి చికిత్సలేదు. కొడుకుతో చిత్రాలు రాయకూడదని చెప్పకూడదు. లేత హృదయాలకి ధర్మ సూక్ష్మలు తెలియవు. పైగా వద్దన్న పనివేపుకే మొగ్గుతుంది యువకునిబుద్ధి. అందుకని వ్యాసంగంమార్చి దృక్పథం మార్చాలి. శిఖిదత్తునికి కావ్యప్రతులు రాయడానికని నియమించడంలో వుద్దేశం ఇదే.

ఒక్క క్షణమా? ఎంత మందమతిని! అని గొణుగుకున్నాడు.

వెంటనే రాముడి జ్ఞాపకమువచ్చింది. పిచ్చిపిల్ల! తాటంకాలల్లడం అదే నేర్పింది తనకి.

గూటిపైన అస్పష్టంగా ఒక ముఖం, ఒక చెవినున్న తాటంకం చెప్పు గానూ. ఒక పెదవి శీతలంగా తన మనస్సును తాకుతోంది.

"రక్తోత్పలాం రక్తదలప్రభాభ్యాం
ధ్వజోర్ధ్వరేఖా కులిశాంకితాభ్యాం
అశేష బృందారక వందితాభ్యాం
నమో భవానీ పదపంకజాభ్యాం"

శివదత్తుని హృదయం తూలికంటే తేలికై ఎక్కడికో ఎగిరిపోతోంది. శ్వాసలు దీర్ఘాలయ్యాయి. అతడికి తెలియని దౌర్బల్యం — ఒక మధుర దౌర్బల్యం అతనిలో ప్రవేశించింది.

## ౬

శ్రీ తాళపత్రాలకి ఈవైపునా ఆవైపునా రెండు కైవారాలుచుట్టి వాటిలో గంటంతో చిత్రిస్తూ కూర్చున్నాడు శివదత్తుడు. రెండు కైవారాలమధ్య రాత. రాముని చిత్రశాలలోని చిత్రాలన్నీ శ్రీ తాళపత్రాలకి ఈవైపునా ఆవైపునా చేరు కున్నాయి.

ఈ బొమ్మలు గీసేది, రాత రాసేది శివదత్తునిలోని సగంప్రజ్ఞయే. మిగతా సగం ఎక్కడో అడివి గుర్రంలా విహరిస్తోంది.

రుద్రదేవ భట్టారకులకు తాత్కాలికంగా అలికంమీద అక్షి మొలిచింది. అతని హృదయసముద్రంలో మథనప్రారంభమై, హాలాహలంలాగ క్రోధముదిత మైంది. రుద్రునిలాగే రుద్రదేవ భట్టారకుల క్రోధంకూడా కంఠంలోనే చిక్కు కుంది. కంఠంలో సుడులు తిరుగుతూవున్న మహోరుద్రంతో మిళితం అయిపో యింది ఈ క్రోధం.

శిఖిదత్తునికి అతనిచేత ఎంతవరకు పూర్తి అయిందో చూపించడానికి ఆజ్ఞ అయింది!

రుద్రదేవ భట్టారకుల దృష్టి తాళపత్రాలనుంచి కదలలేదు. అతని దృష్టి భ్రూమధ్యభాగమందున్న ఆజ్ఞాచక్రాన్ని భేదించుకుని ఎదటనున్న శిఖిదత్తుని శూలాలతో పొడుస్తోంది. వాత్సల్యంతో వెంటనే గాయాల్ని నిమురుతోంది.

“గ్రంథాలయాలను స్థాపించడం వైదిక సంప్రదాయం కాదు. విజ్ఞానం ఎంత తక్కువ స్థలాన్ని ఆక్రమిస్తే అంత ఉత్తమం. చిత్రాలవల్ల అనవసరంగా పత్రాలెక్కువ ఔతాయి. తుచ్ఛకీటకాలకు కూడా లొంగిపోయే ఈ విద్యావిధానం విద్య అనే శబ్దానికే అపార్థం కల్పిస్తోంది. మహర్షులు సూత్రాలే ఎందుకు రచించేవారో తెలియదా?”

మేరుగిరిగహ్వరాలలో గడ్డకట్టిన శబ్దం ప్రచండ వాతాహతికి కరిగి సుడులు తిరుగుతూ వెలికి ప్రవహించినట్లు, రుద్రదేవ భట్టారకుల విశుద్ధ చక్ర చంక్రమణఘోష వెల్లువలై పారింది.

శిఖిదత్తుడు అనిమిషుడై తల ఊపాడు. ఒక్కసారి లజ్జాతరంగం అతని ఆపాదమస్తకమూ ముంచెత్తి చైతన్యాన్ని హరించింది. అతనిలో ఇప్పుడు లజ్జాతన్మాత్రే లేదు.

•

అసలు ఈ చిత్రాలు తాను ఎందుకుగీశాడు? తాను నిజంగా బ్రాహ్మణుడేనా? గోత్రర్షులు నక్షత్రాలనుండి తొంగిచూసి ఏమనుకుంటారు? కళాకారులు అపాంక్తేయులు, గ్రామబాహ్యులు. అయితే నాయనగారు పండితగోష్ఠిలో కళాచర్చ చేస్తారే? “అగ్రబిందు పరికల్పితాననాం” అని కామకళనుగురించి ప్రహరలకు ప్రహరలే వ్యాఖ్యానం చేస్తుంటారే?

బృహదారణ్యకోపనిషత్తులో కళాచర్చ వుందట. స్త్రీలు కళాస్వరూపిణులు. వేదాధికారం అందుకే లేదు. చిత్కళ—వేదమాత.

శిఖిదత్తుని ఆలోచనలు ఒకదానికొకటి పొందకుండా వెంటవెంటనే వస్తున్నాయి. ఉష్ణాధిక్యంవల్ల ద్రవ్యంలోని సంఘటనాశక్తి చెదిరి ఏ అణువు కా అణువు

విడిపోయినట్లు అతనిలోని తపనతీవ్రోజ్జ్వలమైన భావప్రవాహాన్ని భావామృతస్రోతంగా మార్చింది.

:·:    :·:    :·:

చిత్రించిన పత్రాల్ని వేరేపెట్టి శుద్ధప్రతిని పత్రానికి 40 పంక్తులచొప్పున రాయసాగాడు శిఖిదత్తుడు.

రుద్రుని నెత్తిమీది జాబిల్లి కరిగి నీరై జాలువారింది. రుద్రదేవభట్టారకుల నయనాలు వెన్నెలలు కురిశాయి.

## ౭

మూలదేవుని కలిసికొని చాలాకాలమైంది శిఖిదత్తునికి. అల్లంతదూరాన్నే చూసి పరుగుపరుగునవచ్చి మిత్రుణ్ణి గుచ్చి కౌగలించుకొన్నాడు మూలదేవుడు.

రాజశేఖరోపాధ్యాయులు కుశలప్రశ్నలు వేశారు.

సహపాఠులు శిఖిదత్త శిరస్సుచుట్టు తేజోపరిధి వున్నట్లు భ్రమించారు.

కౌముది పిచ్చిపిల్లకాదు ఇప్పుడు. శరత్కౌముదిలా సోమరిగ లేత యౌవనాన్ని ప్రతి అంగంనుంచి వొలకపోస్తోంది. పిచ్చిపిల్ల — కొంటితనపు చాయలు కళ్ళలోమాత్రమే మిగిలాయి. శిఖిదత్తుని చూడగానే కళ్ళల్లోంచి చిలిపి అల్లరిజారి నిలువెల్ల నిండింది కౌముదికి.

మూలదేవుడు తను చదివిన కొత్తగ్రంథాల్ని, తను గీసిన కొత్తచిత్రాల్ని చూపినాడు మిత్రునికి.

శిఖిదత్తు అదేది చూడ్డంలేదు. అతడి దృష్టులు శూన్యాకాశ అగాథాలలో దేన్నో వెతుకుతున్నాయి. మూలదేవుడుకూడా శూన్యంలో మునిగాడు. అసలు శిఖిదత్తుని స్పర్శసోకిన ప్రతి అణువు శూన్యమే ఆ సమయంలో.

దూరాన రెండుమబ్బు లెక్కడికో ప్రయాణంకట్టాయి.

" జాతం వంశే భువనవిదితే పుష్కలావర్తకానాం
జానామిత్వాం ప్రకృతి పురుషం కామరూపం మఘోనః "

ఆ వెనువెంటనే ఈ శ్లోకం వినబడి మొదటిసట్లుగా వినపడింది. శిఖిదత్తుడు వెనక్కి తిరిగాడు కౌముది కిలకిల నవ్వింది.

"నభోమాస మాసన్నమయింది" అన్నది కౌముది.

అందుకనే ఇలా వచ్చాను. నాయనగారు గ్రామాంతరమేగినారు. నాలుగు నెలలు దాకా ఆటవిడుపు అన్నాడు శిఖిదత్తుడు.

కౌముదిలో గాంభీర్యం అలముకొంది. మూలదేవునిలో ఆనందం పొంగిపొరలాడింది. ఆ రోజంతా శిఖిదత్తుని చిత్తముందర మేఘాలే పారాడాయి.



వితస్తి వెడల్పూ అరత్నిం పొడవూగల తూపకార పత్రాల్ని అయత్తపరచి వుంచాడు శిఖిదత్తుడు.

వర్తికానముద్గకమూ వర్ణపుటికా శఫలేఖనీ మొదలయినవి సర్దింది కౌముది. ఇద్దరూ శిఖిదత్తుని ఆగమనంకోసం నిరీక్షిస్తున్నారు.

మే ఘ దూ త కావ్యాన్ని చిత్రించడానికి మిత్రులిద్దరూ పూనుకున్నారు. అంతకు తొలిరోజుననే కాచిన లాక్షారసమూ, వజ్రలేపమూ తమలోని జిగివల్ల మిత్రాగమన విలంబనాన్ని సహింపరానిదిగా చేస్తున్నాయి మూలదేవునికి.

కౌముది తనే యక్షుడైపోయినట్లు శిఖిదత్తునికోసం ఒక అభ్రశకలాన్ని పంపడానికి ఆలోచిస్తోంది.

.... .... ....

కౌముది శుక్తిసుధని ముద్గగుడజలాల్లో కలిపి పత్రంపైన ఐరికవర్తికతో పూసింది.

శిఖిదత్తుడు పత్రికవర్తిక లాక్షారసంలో ముంచి స్నిగ్ధతరుచ్ఛాయాసీమమైన యక్షుణ్ణి చిత్రించాడు.

యక్షుని కొలతలు తప్పాయని మూలదేవుడన్నాడు.

యక్షుడు దేవయోని కాబట్టి హంసకజాతికి చెందినవాడు. వ్యాయతః షడుత్తర శతాంగుళ ప్రమాణం గలిగినవాడుగా వుండాలి. కాని, ప్రథమశ్లోకమే మరచినట్లున్నారు అన్నగారు. శాపంవల్ల యక్షునికి మహిమా ఉత్సాహంవల్ల అన్నగారికి మతి నశించాయి. యక్షుని షణ్ణవత్యంగుళ పూరుషునిగా ఎందుకు రచించాలో ఇప్పటికైనా అర్థంఅయిందా? అని కౌముది మూలదేవుని ఢీకొంది. శిఖిదత్తుని మనస్సంతా తూలికాగ్రంలో కేంద్రీకృతమైవుంది.

ఉపచిత్రణందగ్గర మళ్ళీ వాదన వచ్చింది. స్నిగ్ధచ్ఛాయల నిచ్చేది వట వృక్షం అని మూలదేవుడు. కాదు ఇంకేదైనా అయివుంటుందని కౌముది కొంత సేపు వాదించారు. ఈ లోపున శిఖిదత్తుడు ఛత్రాకారపత్రాలు గలిగిన ఒక మహా వృక్షాన్ని చిత్రించాడు.

"వటవృక్షం ఆశ్రమతరువుగా శోభించదు. సాత్వికమూర్తులైన ఆశ్రమ వాసులు వృక్షచ్ఛేదానికి ఒప్పుకోరు. వటవృక్షం క్రమంగా జడలు విరియబోసుకొని రాకాసిలా కుటీరాల్ని పుక్కిట పెట్టుకొంటుంది. అందుకని వటంకంటె మసృణచ్ఛాయలనిచ్చేది సప్తపర్ణి" అని శిఖిదత్తుడు వ్యాఖ్యానించాడు.

గీసిన రేఖలపైన గారుత్మతవర్ణం పూసింది ప్లక్షాంకుర తూలికతో కౌముది.

జనద భస్మంలో దరదం కలిపి అశ్వత్థాంకుర తూలికతో యక్షుని శరీరానికి పూశాడు శిఖిదత్తుడు. ఈ యక్షునికి రక్తవసనంలేదు తెల్లని వలువవేకట్టాడు. అంచుమాత్రం ఎర్రనిది. కండ్ల రెప్పలమీది స్నిగ్ధత పోగొట్టి మూతపడడానికి అవకాశాన్ని సూచించే సన్నని రేఖల్ని గీశాడు అనిమిషత్వం కోల్పోయిన యక్షునికి.

గోదాగర్భ నైకతాన్ని స్వర్ణచూర్ణంతో కలిపి వైక్రాంత ఖల్వంలో నూరాడు మూలదేవుడు. దాన్ని వజ్రలేపంతో మేళవించి వరాహరోమాని కంటించింది కౌముది. శిఖిదత్తు నెమళ్ళకీ, ఆకాశానికీ, ఆభరణాలకీ స్వర్ణరంజనం చేశాడు.

౯

శిఖిదత్తుడు చిత్రాలు గీయడం, కౌముది వరాహదంతంలో మెరుగు దిద్దడం, మూలదేవుడు చిత్రానికి కుడి ఎడమవైపుల శ్లోకాలు రాయడంతో గ్రంథం పూర్తి అయింది.

భూమ్మీది బురదలింకాయి. గోదాదేవి పద్మినీజాతి భామలాగ పల్చబడింది. శరల్లక్ష్మి ఆశ్వీజ కృష్ణపక్షంలో తమోభిసారిక అయింది.

తాను చిత్రించిన కావ్యాన్ని చూసి తానే మురిసిపోయాడు శిఖిదత్తుడు.

మూలదేవుడు లోపలనే శిష్యత్వ మంగీకరించాడు.

కౌముది వర్ణించరాని వింతభావాల బరువుతో చూపులో, నడకలో, ఆటలో, మాటలో అన్నిట్లోనూ మందగించింది.

రాజశేఖరోపాధ్యాయుల అలికంమీద సంతోషాచ్ఛాదితమైన అంతరాంతర విషాదరేఖ ఒకటి గోచరించేది ఆ చిత్రాల్ని చూసినప్పుడు.

చాతుర్మాస్య పరిషత్సమావేశానికి వెళ్ళిన రుద్రదేవభట్టారకులు తిరిగి వచ్చారు. శిఖిదత్తునికి పూర్వ కార్యక్రమం ప్రారంభం అయి ది.

రుద్రదేవ భట్టారకుల భ్రువులమధ్య ఆలోచనాధిక్యంవల్ల సన్నని వళు లేర్పడ్డాయి.

తండ్రి గ్రామంలో లేనప్పుడు తాను చేసినపని, ఆనాడు ఉత్తరరామచరిత్ర రాసేటప్పుడు తాననుకొన్న మాటలు శిఖిదత్తుని హృదయంలో ఒకటినొకటి ఒరుసుకున్నాయి. ఈ భావసంక్షోభం శిఖిదత్తునిలో నానాటికీ ప్రస్ఫుటం కాసాగింది.

శిఖిదత్తునిలో మార్పు గమనించిన రుద్రదేవభట్టారకుల భ్రూమధ్యగతోర్ధ్వ రేఖలు ఇంకా ప్రగాఢం కాసాగినాయి.



మర్నాడు కార్తిక పౌర్ణమి. రుద్రదేవభట్టారకుల భ్రూమధ్యం శారదాభ్రంలాగే నిర్మలంగా సాగింది.

శిఖిదత్తుని హృదయంలో కలిగే సంక్షోభ తరంగాలు విద్యుద్వేగం వహించాయి. అక్షులార్ద్రాగ్రము లైనాయి. నాశికాపుటాలు కుంచించుకుపోయాయి. అధరం కొంచెం వెనక్కి విరిగింది.

మేఘదూత కావ్యాన్ని చిత్రించినట్లు విన్నాను—అదెక్కడ వుంది? అని రుద్రదేవభట్టారకులు హృద్గత బడబాగ్నిని వాత్సల్యజ్యోత్స్నతో కప్పి శిఖిదత్తు వైపు చూశారు.

శిఖిదత్తుడు గ్రంథాన్ని తీసుకొనిరావడానికి రాజశేఖరోపాధ్యాయుల అంతికానికి బయలుదేరాడు. పుస్తకం తీసుకొనిపోవడానికి వచ్చిన మిత్రుణ్ణిచూసి మూలదేవుడు ఆశ్చర్యపడ్డాడు. అతడి వైఖరినిచూసి కౌముది కంపించిపోయింది.

“అహో! ఈ చిత్రాలు శిఖిదత్తువేనా? ఈ కళాప్రవాహం తవ వంశ ప్రతిష్ఠను కూకటివేళ్ళతో కుద్దలిస్తుంది. ఇక ఊరుకుంటే వీని కీర్తి వింధ్య దాటి హిమాలయాలు మెట్టి త్రివిష్టపశృంగాల్ని అందుకుంటుంది. భ గ వా ను డ గు రుద్రుడే తన వంశాన్ని ఈ ఆపదనుండి కాపాడాలి అనుకున్నారు. తనకు తెలియకుండానే రెండు మూడావృతులు చేశారు గ్రంథాన్ని రుద్రదేవభట్టారకులు.



రుంజలు, తప్పెట్లు, శంఖాలు, కొమ్ముబూరలు సంధ్యానటుని నాట్యానికి ఆతోద్యాలైనాయి.

దేవాలయంముందు స్తంభాలకి గడ్డి అరటిచూరుతో కట్టిన తోరణంచుట్టూ దూరంగా ప్రజలు గుమిగూడారు.

రుద్రదేవ పురస్కృతమైన బ్రాహ్మణులు మహా రుద్రాన్ని ఉచ్చైస్స్వరంతో గానంచేస్తూ దేవప్రాంగణం చేరారు. శిఖిదత్తుడూ మూలదేవుడూ తదితర సహపాఠులూ తోరణప్రాంతంలోనే మాట్లాడుతున్నారు. జైనలోకమూల తదితర గ్రామస్థు లోకమూల బారులు తీర్చారు. కౌముది ఇతర బాలికలతో శిఖిదత్తుడికి దగ్గరగానేవుంది. కాశ్మీర శాలువ కప్పుకొని బద్ధదృష్టితో శిఖిదత్తుణ్ణే చూస్తోంది.

రుద్రదేవభట్టారకులు ఆతన్ని ప్రార్థించి శిఖిదత్తుని చిత్ర మేఘదూతాన్ని తోరణానికి కట్టారు. శిఖిదత్త మూలదేవాదులకు ఈ చర్య అర్థంకాలేదు.

కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే—

తోరణానికి చిచ్చు అంటింపబడింది. పైపైరవాద్య శంఖధ్వనులతో పెద్దమై స్వరరూపాన్ని అధిగమించి మిన్నంటింది. మాహేశ్వరులు రుద్రుని వాలకెనెత్తి మహా కోలాహలంతో తోరణం దూరారు. ఆర్తప్రజలు వారిని వెన్నంటారు.

జుహూవాయుడు పకపక నవ్వుతూ నలుమూలల నలుముకొన్నాడు. శిఖిదత్తునికి శరీరంమీద స్మృతితప్పింది. కనీనికలు భ్రూమధ్యగతాలై ఆజ్ఞాచక్రం ఒకటిగా కలిసిపోయాయి. నాశికాపుటాలు సంకుచితాలై వాయుమార్గాన్ని పూర్తిగా విరోధించాయి ఒక్క పరుగునపోయి ఎగిరి గ్రంథ మందుకోబోయాడు, అందలేదు. కౌముది పిచ్చెత్తినట్లు అంతవరకూ చూస్తూవున్నది. వెనకనించి వచ్చి శిఖిదత్తునిపైన చెయ్యివేసింది. కౌముది హస్తస్పర్శ శిఖిదత్తులో బీజరూపంగావున్న శక్తుల్ని వికసింపజేసింది. ఆతని సహస్రారంలో కలామాత్రమైన జ్యోత్స్నరేఖ ఒకటి పొడమినట్లుతోచి అతనికి లాఘవాన్ని ప్రసాదించింది. శిఖిదత్తు డింకోమారు ఎగిరాడు తాడు దొరికింది.

వైశ్వానరుడు తననే ఉపాసించే శిఖిదత్తుని సహస్ర బాహువులతో ఆలింగనం చేసుకున్నాడు. సహస్ర నేత్రాలతో తనివితీరా చూశాడు. సహస్ర శీర్షాలూవంచి మూర్ధ మాఘ్రాణించాడు. కౌముదికి అగ్నిదేవుని విరాడ్రూపంతప్ప ఇంకేమీ కనపడలేదు. ఆ మహా కోలాహలంలో కౌముదిని కాని, శిఖిదత్తుని కాని చూసినవా రెవరూ లేదు.

శిఖిదత్తుడు దబ్బున నేలమీద పడ్డాడు. అతని బట్టలనున్న పిల్లమంటలు తల్లినెత్తుకోమని చేతులుచాచే పిల్లల్లా తోరణంవైపుకి చేతులుచాస్తున్నాయి.

కౌముదికి మతిపోయింది. తన వల్లెవాటు శాలువను శిఖిదత్తుమీద కప్పింది. తాను అర్ధదిగంబరి అయిన సంగతికూడా ఆమెకు తెలియదు. స్నేహితురాండ్రంతా చుట్టుముట్టారు. శిఖిదత్తుని పార్శ్వనాథాలయ ప్రాంగణానికి చేర్చారు.

మూలదేవుని ముఖంపై నీళ్ళు జల్లుతూన్న రాజశేఖరోపాధ్యాయులు వీరిని చూచి మూలదేవుని సహపాఠుల కప్పగించి తమూ పార్శ్వనాథాలయం చేరాడు. శిఖిదత్తునికి స్మృతిలేదు, కౌముదికి మతిలేదు.

రాజశేఖరోపాధ్యాయులు దేవళమువెనుకకు వెళ్ళి పెన్నెట్లో వెతికి నవనీత పర్ణి తెచ్చారు అది నలిపి రసం శిఖిదత్తుని శరీరానికి పూశారు,

మూలదేవుని భుజంపై నెత్తుకొని రుద్రదేవభట్టారకులు అక్కడికి చేరారు. వారివెంట రాజశేఖరోపాధ్యాయుల శిష్యగణం, ఆ వెనుక బ్రాహ్మణులు, కాగడాలు, మాహేశ్వరులు, ప్రజలు అంతా పార్శ్వనాథ దేవాలయ ప్రాంగణం చేరారు.

రాజశేఖరోపాధ్యాయులు ఆతంద్రీపత్రరసం కొబ్బరిచిప్పలో పిండుతున్నారు. రుద్రదేవభట్టారకులు ఆలాగే మూలదేవుణ్ణి ఎత్తుకొని నిలబడివున్నారు. ప్రజలు భిత్తికా చిత్రాల్లావున్నారు.

అందరూ అర్ధదిగంబరియై స్మృతిలేక శిఖిదత్తుపక్కన పడివున్న కౌముదినే చూస్తున్నారు.

శిఖిదత్తుని చేతిలో సగం కాలిన మేఘదూతకావ్యం రుద్రదేవభట్టారకుల దృష్టిని పడింది. ఒక వేడి నిట్టూర్పువిడిచి తల పైకెత్తారు — ఎదుట దిగంబరిగా నిలిచివున్న పార్శ్వనాథుని అలికంపై చంద్రరేఖ మెరిసినట్లైంది. మహోత్తుంగుడైన పార్శ్వనాథుని మూర్ధంపై చీకటులు, నల్ల త్రాచులు పడగలు విప్పినట్లు కదిలాయి.

ఆ తంత్రీప్రసాదాన్ని గుండెలకద్దేసిన శిఖిదత్త కౌముదులు ఒకరినొకరు చూసుకున్నారు.

కౌముది తన అర్ధదిగంబరత్వానికి నిలువెల్లా కంపించి శిఖిదత్తునిపైనున్న శాలువలో దూరింది.

రుద్రదేవ భట్టారకులు ఫక్కున నవ్వారు.

---

( ఆదినుండీ వైదీకులకు చిత్రకళ అంటే మంట. చిత్రకళాభ్యాసం బ్రాహ్మణీకాన్ని చెరుపుతుందని నమ్మేవారు. ఇదే యీ కథకు వస్తువు. అట్టి మూఢాచార కుటుంబంలో ఉద్భవించాడు శిఖిదత్తుడు. చిత్రకళ అంటే ప్రాణం. తండ్రీ కొడుకులకు ఘర్షణ, సంప్రదాయానికీ ప్రగతికీ ఘర్షణ. కౌముది జైనబాలిక. చిత్రకళ, శిఖిదత్తులంటే అమిత ప్రేమ. అగ్నిహోత్రుడికి ఆహుతి అవుతున్న మేఘదూత చిత్రాలను తన హస్తస్పర్శతో శిఖిదత్తునిలోని శక్తుల్ని రేకెత్తించి రక్షించింది. తుదకు చిత్రకళను, ప్రియుని రక్షించుకుంది. సంప్రదాయానికీ చిత్రకళకు వచ్చిన ఘర్షణలో కవీ చిత్రకారుడు అంగీరస్ చిత్రకళకు విజయం చేకూర్చాడు.

కథ ఉదాత్తమైన శైలిలో నడిచింది. కథనవిధానం అత్యుత్తమం. చిత్రకళను వస్తువుగా స్వీకరించి రచించిన కథలు తెలుగులో అరుదు. అట్టివాటిలో యిది తలమానికం. కథకుని వ్యుత్పన్నత గోచరిస్తుంది కథలో.

— సంపాదకులు.

# తమోభిసారిక

ఆంగీరస్

చీకటి నింపిన చిమ్ముడు గొట్టాల్
ఆకస మొలికిన తడి నిట్టూర్పులు
ఒకటిగ పెనగొని ఉరుకులు పెట్టాయ్ !

నల్ల మబ్బులకు నడకలు దిద్దే
నల్లమద్ది కై పెక్కిన కంపం
తప్పు తాగి తల వాల్చేసింది

అప్పుడు !

తన ఒడిలో దోబూచులనాడే
మెరపు కన్నియల నిలపలేని కా
ర్మొగులులాంటి దువ్వలువ గప్పికొని
చీమక న్నెకల సంగీతానికి
చిరుపాదంబుల తాళము వేయుచు
సాగుతోంది ముందుకు —

— ఎందుకు ?

ఏ యెడద దీప మెలిగించుటకో !
ఏ లేతగుండె లులికించుటకో !

ఏ భగ్నవీణ పలికించుటకో !
ఏ శుష్కతనువు పులకించుటకో !

ఈ అభిసరణం
ఈ అనుసరణం.

---

( ఈ అభిసరణం ప్రపంచ సత్యం. ఎందుకు, ఎక్కడికి అనే సందేహం నివృత్తి అయేదికాదు. ఈ ఆవేదన అనంతం. అదే సమాధానం. కవి హృదయం ఎంత సున్నితమో దీనివల్ల వ్యక్తమౌతుంది. కవి తానే ఇట్టి అభిసరణావస్థలో ఉన్నాడని ధ్వనిస్తుంది. — సంపాదకులు. )

# నేటి గుమాస్తా!

## బో. సుబ్బారావు

ఈ రోజుల్లో "గుమాస్తా" అనే పదం కేవలం హేళనగా మారింది. "Poor Clerk" అంటాడు ప్రపంచవాడు. ఏదయినా ఆఫీసులో ఇనుప పని ముట్ల సెక్షనులోనూ, ఎరువుల సెక్షనులోనూ పనిచేసేవాళ్ళను కేవలం "ఇనుప గుమాస్తా", "ఎరువు గుమాస్తా" అనే సంబోధించటం. "పెంట గుమాస్తా" అంటారేమో ఇకముందు? అట్లాగే కిరసనాయలు, అప్పుగుమాస్తా. బొంబాయిలో "పాకీవాళ్ళ" సమ్మె అనంతరం వాళ్ళ జీతాలు, మదరాసు క్లర్కులతో సమానంగా హెచ్చుచేసారన్న విషయం అందరికీ తెలిసిందే. గ్రాడ్యుయేట్ క్లార్కులకు ఇంతకన్నా అవమానం ఇంకేముంది? అందుకనేగాపును "ఈ రోజుల్లో ఏమిటండి! వంకాయలకన్నా చౌకండీ ఈ గ్రాడ్యుయేట్లు" అంటారు. గుమాస్తాకి ట్రేడ్ మార్కులు రెండు. ఒకటి వంగిన నడుం, రెండోది వాతకోటు. బైట బాధ ఇట్లాఉంటే, ఇంట్లోబాధ ఎట్లా ఉంటుందో ఒక "రంగంలో" చూద్దాము.

[ గుమాస్తా "గణపతి" గారిల్లు. కొడుకు భీమేశ్వరశర్మ. భార్య మహాలక్ష్మి. చంటిపిల్ల "శశి". గుమాస్తాగారు వంద ఫైల్సు ముందేసుకొని లెక్కల్లో ఉక్కిరి బిక్కిరి అవుతున్నారు. ఇంట్లో పిల్లవాడి అల్లరి. చంటిపిల్ల ఏడుపు. గంట 9—30. ]

గణపతి:—ఏమిట్రా ఇంట్లో గోల, "భీమూ!"

భీము:—............

గణపతి:—ఏంచేస్తున్నావురా?

భీము:—పాపాయిని ఆడిస్తున్నా.

గణ:—ఎప్పుడూ ఆటలేనా? ఐదోక్లాసు రెండోమారు చదువుతున్నావు. సిగ్గులేదురా తీయి పుస్తకం.

(భీము వెళ్ళి పుస్తకంతీసి చదువుతూ ఉంటాడు.)

గణ:—చదువు లేకపోవటంచే బుద్ధి పనిచేయటంలా. ఆరే భీమాయి!

భీము:—ఆ!

గణ:—ఇటురా.

భీము:—..........

గణ:—ఏం చదువుతున్నావురా?

భీము:—పుస్తకం.

గణ:—ఏంపుస్తకంరా?

భీము:—(చూసి) ఇంగ్లీషు.

గణ:—ఏ పాఠంరా?

భీము:—.........

గణ:—చెప్పవేం?

భీము:—తెలియదు.

గణ:—పోనీ కథ తెలుసా?

భీము:—తెలియదు.

గణ:—మరేమిటిరా చేస్తున్నావు?

భీము:—బొమ్మ చూస్తున్నా.

గణ:—ఛడవా, చదవరా. వచ్చేయేడన్నా ప్యాసుకారా.

భీము:—..........

గణ:—ముందు ఒక దక్కన్ పెట్టె తెచ్చి మరీయేడువ్.

(మహాలక్ష్మి ప్రవేశం)

మ:—రేపు శనివారం బజారుకు వెళ్తారుకదూ.

గణ:—దేనికి?

మ:—నిన్ననేకదండి చెప్పింది చీరసంగతి.

గణ:—అద్దె ఏంచెయ్యమంటావు?

మ:—మర్చిపోయా! నిన్న ఆ బొంతు గురవయ్యశెట్టి వచ్చాడు. అద్దె ఇవ్వటంలేదని "Case" పెడ్తానన్నాడండి.

గణ:—అన్నీ ఏడ్చాయి. నామీదనేనా? హోల్డా, బాంకా?

మ:—సరి రావంటారేమండి. మొన్న చూడండి పుల్లమ్మ పెనిమిటికి పది వేలు వచ్చింపట. మీరుకూడా వేయరాదండీ ఆ పజిల్సు.

గణ:—అవి వేయబట్టే ఇంతకాదనువచ్చాను, ఈ గతిపట్టింది. ఒక్క మారుగాపును ఐదోప్రైజు వచ్చింది. అదయినా ఏమిటంటావ్ Razer బ్లేడు. వాక్తే షేవింగు.

మ:—ముందు అదృష్టం ఎట్లావుందో. ఇంకోమారు వేయరాదండీ.

గణ:—మిసెస్ గణపతి ఒక్కమాటవోయి! సరి అదంతట అదే వస్తుంది అదృష్టం వుంటే. లేకపోతే డబ్బా ఆముదం పూసుకుదొర్లినా అంటదు. అందాకా ఎందుకు Darling! రెండువేలను నాలుగు సున్నాలు ఎందుకుచేశాడు నా మామ నీ Face కాకపోతే!! సరి మనకు సున్నేనోయి!!

మ:—ఏమయినా అంటే చెప్పి పొడుస్తారు ఇంతేగా. చీరా వద్దూ రవికా వద్దు............నా ఖర్మ.

గణ:—ఊ! డిటో!!

మ:—(నవ్వి) పోనీ పిల్ల ఏడుస్తున్నది ఎత్తుకుంటారా!

గణ:—Males స్నానం చేయలేదనా చూస్తున్నావ్.

(భీము ప్రవేశం)

గణ:—తెచ్చావురా సిగరెట్లు?

భీము:—ఇవిగో.

గణ:—కాసేపు పాపాయి నెత్తుకోరా ఏడుస్తున్నాడు.

భీము:—అపుతే పుస్తకాలు మూసేసేయనా నాన్నా!

గణ:—తెరిచావుగనకా మూయటానికి, పోరా. క్లాసుకి మూడేళ్ళు ఖాయం.

మ:—సరే ఎవరూ ఎత్తుకోవద్దు. చదువుకో నాన్నా.

(మహాలక్ష్మి వెళ్ళినతరువాత భీము చదువుతూఉంటాడు. Files కేసి దీర్ఘంగా చూస్తూ)

గణ:—Figure tally కావటంలేదే? తొమ్మిది, ఎనిమిది, పది హేడు, ఆరు..........

భీము:—నాన్నా, "Pain" అంటే ఏమిటి?

గణ:—ఇరవయిమూడు పేజి..........

భీము:—నిన్నే నాన్న "Pain" అంటే,

గణ:—మున్నయి....దీన్నెవరి చూడు....మున్నయ్యి రెండు....

భీము:—చెప్పునాన్న!

గణ:—ఏమిట్రా, పానకంలో పుడకలాగా. Pain అంటే "బాధ"

భీము:—అంటే!

గణ:—నా Ceremony! "బాధ" అంటే తెలియదు. నీ Head తీసుకువెళ్ళి ఆ Wall కు "ఢీ" ఇయ్యి!

(Postman ప్రవేశం, మహాలక్ష్మికూడా)

గణ:—ఏమన్నా మనీఆర్డరు ఉందా పోస్టుమాన్!

పో:—చూస్తాను..........ఇదిగో ఈ లెటరుంది.

గణ:—ఎక్కడ్నుంచి?

పో:—ఇదిగో సార్. బేరింగ్ మూడణాలు ఇవ్వండి.

గణ:—మనీఆర్డరు లేకపోగా మూడణాల కాష్ట్రియిలా!

మ:—పైపుచేసిన కవరు తీసుకోండి. చిళ్ళ అంటించటం ఎవరయినా మర్చిపోయారేమో.

గణ:—మూడణాలంటే "దక్షిణపెట్టి" ఏంఖర్మం.

మ:—నా దగ్గరున్నది ఇస్తాలెండి.

(పోస్టుమేన డబ్బు తీసుకు వెళ్ళిపోతాడు)

మ:—చదవండి అందులో ఏముందో?

గణ:—(కవరు చించి) విను. శ్రీ సా యి బా బా అని లక్షమారులు వ్రాయుము. నేను నీకు వ్రాసినట్లు నీ స్నేహితులు తొమ్మిదిమందికి వ్రాయుము. లేనిచో నీ పిల్లలు చచ్చుదురు, నీ ఉద్యోగము నాశన..........

మ:—అదేమిటండి?

గణ:—ఛీ! ఛీ!! ఛీ!!! (అని కవరు చించును) సాయిబాబా లేదూ గీయిబాబాలేదు. నేను రాయను గీయను.

మ:—పెట్టకండి.

ఏమ:—అమ్మా! తలకాయ నొప్పిగాఉందే!

మ:—అదిగో చూశారా! పెట్టవద్దంటే ఉన్నారు. అప్పుడే నాన్నకు తల నొప్పి.

(గడియారము పది కొట్టింది)

గు:—తరువాత చూద్దాం. ముందు అన్నం వడ్డించు పది అయింది.

మ;—అసలు నేను వచ్చినపని మర్చిపోయాను.

గు;—ఏమిటది?

మ;—ఇందాకచూశా, బియ్యం నిండుకున్నాయి.

నేడు గుమాస్తా ఇట్లావున్నాడు. ఇంట్లో ఇంతితో, బైట అప్పుతో, ఆది వారమయినా ఆఫీసుతో బాధ. ఇంకా మోక్షం ఎప్పుడు?

---

(సామాన్యంగా మానవునికి ప్రపంచమనేది ఎక్కువ సన్నిహితంగా ఉన్నదే. ఇది అండర్ డాగ్ ఎడల సానుభూతితో, హృదయంగమమైన హాస్యంతో ఉన్న ఘట్టచిత్రణం. హాస్యాన్ని సామాన్య వస్తువులలో, సామాన్య జీవితంలో రంగరించగా వచ్చినదే ఇది. శ్రీ సాయిబాబా శిష్యపరమాణు వుకృత్యం. భక్తకోటికి సర్వసాధారణమైన కార్యనిర్వాహణం, స్త్రీల మూఢ నమ్మకంపై ఎట్టి ప్రభావం చూపెట్టగలదో చక్కగా గోచరిస్తుంది.

— సంపాదకుడు.)

# ఎక్కడ?

శశికుమార్

మండు వేసంగిలో
మిటమధ్యాహ్నాన
ఎండ నిప్పులుగక్క
వేడి గాడ్పులువీవ
వాడిన ముఖాలతో
శుష్క దేహాలతో
జీర్ణవస్త్రాలతో
తట్ట నెత్తినబెట్టి

కాయకష్టముచేయు
కూలివారలవంక
కాలువలుకట్టినా
చెమట పొంగులవంక
చూచితేచాలురా
గుండె నీరౌనురా

దేవాలయంబులో
నిర్జీవ ప్రతిమలో

లేదురా దేవుండు
లేదురా లేదురా
మడిగట్టినావనీ
నను ముట్టుకోకనీ

ముక్కు గట్టిగ మూసి
చేసే జపాలలో
లేదురా దేవుండు
లేదురా లేదురా

చెమట కాలువగట్టి
కాయకష్టము చేయు
కూలివారల చెమట
బొట్టులో కాన్పించు
కనువిచ్చి చూడరా !

---

(ప్రాపంచిక సత్యాన్ని, మానవత్వాన్ని ఆధారంచేసుకుని కవిత్వం ఉద్భవించింది. కవి సృష్టి సామాన్యజీవితాన్ని దృష్టిపథంలో ఉంచుకుని ఒక "ఉటోపియా" ని ఇచ్చినప్పుడే దానికి సాఫల్యత. ఆ మాదిరిగానే తోడి మానవునిలో ఉన్న మానవత్వాన్ని గుర్తించక ఎక్కడో ఉన్న పరమసత్యాన్ని గుర్తిద్దామనుకోవడం మౌర్ఖ్యం అని ప్రబోధిస్తుందీ సరళగీతం.

— సంపాదకులు.)

# జూ లో

## శశికుమార్

ఏదైనా దారి దొరక్కపోతుందా ఈ మహాపట్టణంలో అని గంపెడాశతో వస్తే....కథ అడ్డం తిరిగింది. సిగ్గుతో, వేదనతో, కుంగింది హృదయం. నిరాశాపిశాచి వికటాట్టహాసానికి వెరచి....ఏ ఆడవైనా పట్టితే........చటుక్కున జ్ఞాపకంవచ్చింది జూ. పట్టు పట్టుమని బస్సు ఎక్కి....నెత్తురోడ్చి, నే నేమో ఉద్ధరిస్తానని నాన్న పంపిన ఆ డబ్బులోది అణన్నర—తొమ్మిది పైసలు....లబ్బు డిలా వణికే చేతుల్తోయిచ్చి, "బాగయాం" అన్నాను రుద్ధకంఠంతో. సాగి పోయే బస్సు చప్పుడులో నా హృదయం మూల్గు ప్రజలచెవిని పడనేలేదు.

నడి సముద్రంలో తుపానులో చిక్కిన జీవితనౌకను ఒడ్డు చేర్చలేకపోవడం, నా అశక్తతా? — లేకపోతే చుట్టుముట్టి ఊపిరాడనీయకుండా ఊగించే తుపానురేపిన ప్రకృతి దోషమా....బుర్రలో రేగుతున్న యీ ఆలోచనలకు "బాగయాం" అన్న కండక్టరుకేక బ్రేకువేసింది. బస్సుదిగి....వగబట్టిన కోడె త్రాచులా....గబగబా....ఇరుప్రక్కలా ఆహ్వానించే ఆ మలయమారుతాన్నీ, తామరాకు పళ్ళెరాలతో హారతులెత్తే సరోవరలక్ష్మినీ, మొగలాయితరహా ఆ సుందర భవనాలను లక్ష్యంచేయక........వాటితో నాకేమీ సంబంధం లేదన్నట్లు........ గబగబా........

దూరాన్నుంచి వినవచ్చే సింహగర్జన హృదయంలో సుళ్ళురేపింది. మహారణ్యంలో సర్వంసహా చక్రంగా రాజ్యమేలుతూ విరోధి తండాలపై ఉగ్రరూపంతో ఉరికేవేళచేసే గర్జనకాదది. విరోధి మదమణచి ఆకాశం చిల్లులు పడేటట్టుచేసే విజయగర్వ సంభరిత సింహనాదమూకాదది. ఏ కిరాతుడో దారి కడ్డంతగిలి మానాన్నపహరింప యత్నించేవేళ మహాపతివ్రతచేసే ఆర్తనాదం అది. బానిస జీవితానికి హృదయంలో కుమిలి....ఎదిరించి........స్వాతంత్ర్య

సంపాదన యత్నంలో యజమాని యినుప పాదాల బరువుక్రింద అణిగిపోతూ బానిసచేసే ఆక్రందనం అది. ఎందుకు? ఎందుకు? నా హృదయాన్నింతగా కలచుతుంది? నాలానే పారతంత్ర్య బంధాలను తెంపుకోజాలని ఆ సింహంచేసే ఆర్తనాదం మూగవోయిన నా హృదయవీణకు తిరిగి నాదం కల్పించింది. హృదయం ద్రవించి టప్పున రెండు కన్నీటిచుక్కలు........తుడుచుకుందామనే ధ్యాసైనా లేకుండా—గబగబా....

చంగు చంగున గంతేలేళ్ళుకీపిడలు....పదిగజాల దూరంలో....బోనులో.... యినప చువ్వలపై పంజాపెట్టి, వెనుక కాళ్ళమీద నుంచున్న ఆ మృగరూపం మూర్తీభవించిన బానిసత్వం. ఆ మృగరాజు వదనంలోని విషాద ఛాయలు.... అబ్బా! హృదయ విదారకాలు.

సానుభూతి అయస్కాంతంలా పనిచేయగా....దగ్గరకు....యింకా దగ్గరకు....చిక్కి శల్యంగావున్నా ఆ ముఖంలో రాజఠీవి మాయలేదు. నేత్రాలలో ఏవో కలలు........బహుశః ఒకనాడు తాను మృగరాజుగా, వీంవిహారం చేస్తో

"I am the monarch of all I survey"

"నా చూపుమేర రాజ్యానికి నేనే సర్వంసహా చక్రవర్తిని" అని భావించుకుని వుండవచ్చు. అడ్డువచ్చిన మృగాలను నిర్దాక్షిణ్యంగా వధించి, విజయగర్వంతో జూలులోమంచి చిరునవ్వు నవ్వివుండవచ్చు. మహారణ్యంలో స్వేచ్ఛావిహారం చేస్తూ....ఆకలిగొన్నప్పుడు తనపరాక్రమంచూపి, స్వయంగా మృగాలను వేటాడి కడుపునిండాతిని బర్రున త్రేపిన తాను, నేడు పాపం....గిర్రున తిరగడానికన్నా చోటులేని ఆ జానెడున్నర బోనులో....ఏ పూర్వజన్మలోనో బానిసను హింసించిన పాపఫలంగా చిక్కుకుని........కావలివాడు దయదలచి ఎప్పుడోవేసే ఆ నాల్గు మాంసపుముక్కలు కొరికి తృప్తిపడుతూ జీవం వెళ్ళబుచ్చుతున్నది! ఈ దృశ్యాలన్నీ చలనచిత్రంలా ఆ మృగరాజు కంటిముందు గోచరమౌతున్నాయేమో! తన పూర్వ వైభవం తలచుకొని ఎంతగా తపించిపోతోందో! పాపం!

నేను తదేకదృష్టితో తనవంక చూడడం కనిపెట్టిందేమో నావంక తిరిగింది. ఇద్దరమూ ఒకరి నేత్రాలలోకి ఒకరం సూటిగా చూసుకున్నాం. ఆ కళ్ళు నన్ను చూచి వెక్కిరిస్తున్నట్లనిపించింది. ఆ ముఖంలో మానవజాతిమీద దానికున్న అసహ్యమంతా ప్రతిబింబించింది. తిరిగి నా కళ్ళల్లోకి సూటిగా చూస్తూ నోరు తెరచి....ఏమిటో నిలదీసి అడుగుతున్నట్టు....స్వాతంత్ర్యమా! క్షణికానందంకోసం మా స్వాతంత్ర్యాన్నపహరించిన మీకు స్వాతంత్ర్యమా! మమ్మ బానిసలనుచేసిన రోమకసామ్రాజ్యం....జ్ఞాపకముందా? మా ఉసురుతగిలి ఎట్లా పేరుమాసిపోయిందో? పశ్చాత్తాపంచెంది మాకు విముక్తి గల్గించేటంతవరకూ మీ మానవజాతికి శాంతి చేకూరదు. మా ఉసురుకొట్టి ఎడతెగని యుద్ధాలలో మీరు మీ సంతతీ నశించిపోతారు. మీ జాతి నామమాత్రావశిష్టమైపోతుంది. ఇదే మా శా ప ం — కళ్ళురిమిచూచి గిర్రున వెనక్కి తిరిగివెళ్ళి గదిలో పడుకుంది.

సిగ్గుతో హృదయం ముడుచుకుంది. చిన్నప్పుడు పరీక్షలో కాపీ కొట్టుతూ వుంటే మాష్టరు పట్టుకున్నప్పుడైనా యింతగా సిగ్గుపడలేదు. రాజముద్ర నా చేతిలోనేవుంటేనా! .... తలవంచుకుని....నాల్గడుగులు ముందుకు....

పక్క బోనులోని పులిరాయుడు ఒక్కపెట్టున బొబ్బరించింది. ఆ కేకలో "స్వేచ్ఛ" "స్వేచ్ఛ" అనే పదాలు బాంబులులా వెలువడ్డాయి. భరించలేక ముందుకు నాల్గడుగులు....దూరాన పంచవన్నెల రామచిలుక దీనంగా "స్వేచ్ఛ" "స్వేచ్ఛ" అని అరిచింది. "స్వేచ్ఛ" అని కేకపెట్టింది నెమిలి. ఒక్కమారుగా పక్షులూ, మృగాలూ "స్వేచ్ఛ" "స్వేచ్ఛ" అని ఆక్రందించాయి.

ముందడుగువేశాను...."స్వేచ్ఛ" "స్వేచ్ఛ"

వెనకకు తగ్గాను...."స్వేచ్ఛ" "స్వేచ్ఛ" ముందూ....వెనుకా....అటు....ఇటూ....నలుగడలా...."స్వేచ్ఛ" "స్వేచ్ఛ" "స్వేచ్ఛ" "స్వేచ్ఛ" కళ్ళు మూసుకున్నాను. చెవిలో గింగురుమన్నాయి ధ్వనులు...."స్వేచ్ఛ" "స్వేచ్ఛ"

నా హృదయ హృదయాంతరాళంనుండి పొర్లుకువచ్చాయి: "స్వేచ్ఛ" "స్వేచ్ఛ" అనే పదాలు. కాని ప్రాకృత ప్రపంచం గొంతుకట్టువడింది. ఒక్క పదమైనా వెలికి పైకిరాలేదు. నాలో నేను "స్వేచ్ఛ" "స్వేచ్ఛ" అని జపించాను.

దూరాన హరిణబాలికలు చెంగుచెంగున గంతులేస్తూ....

"ఏ దేశమేగినా, ఎందు కాలిడినా
పొగడరా నీ తల్లి భూమి భారతిని"

అని పాడుకుంటూ తృప్తిపడుతున్నాయి.

క్రూరమానవ హస్తాలకు చిక్కక రెక్కలాడించుకుంటూ స్వేచ్ఛావిహారం చేసే పికసంతతి ఒకేస్థాయిలో

"స్వాతంత్ర్యముహోమ్, స్వాతంత్ర్యముహోమ్
స్వాగతమనవోమ్, కని పని వినవోమ్,
మనవోమ్, ఆనవోమ్,
జమ్, జమ్, జమ్,"

అని గానంచేశాయి.

నేనూ, ముక్తకంఠంతో ఆ పికసంతతితో కలసి "స్వాతంత్ర్యముహోమ్" అని పాడుకునే భాగ్యం ఎన్నటికో! ఎన్నటికో!!

---

(ప్రకృతి మానవుని బానిస చేసింది. ఈ బానిసత్వంలోంచి బయటికి వద్దామని మానవుడుచేసే ప్రయత్నం నూతన బంధనాలను తగిలిస్తోంది. పశుత్వంలో అదే బానిసత్వాన్ని నోరులేని ప్రాణులపై, తిరిగి ప్రకృతిపైరుద్ది విజయినని గర్వించడం నేర్చుకున్నాడు మానవుడు. ఇది గుర్తించే మహదవకాశాల్ని జారవిడుస్తున్నాడు. స్వతంత్రత పొందడమేకాదు మానవత్వానికి పరమాదర్శం— ఈయడంకూడా అని చెప్పక చెబుతుంది ఈ మధురవ్యాసం.

— సంపాదకులు.)

# మధుకన్య

## శశికుమార్

ఓ మధుకన్యా! మధుకన్యా! ఆగు—ఆగు.

నిలిచి మాట్లాడితే నోటిముత్యాలు రాల్తాయా?

అవి కవికుమారుడికి ముట్టితే పాపం వస్తుందా? ఆగు.

ఏం—విభీతహరిణంలా బిక్కు బిక్కు మంటూ దిక్కులుచూస్తావేం? పరిచయంలేందే పలకరిస్తున్నాదేమిటనా? నేనేం పాశ్చాత్యుణ్ణా? లేకపోతే—నా ఖద్దరుగుడ్డలు యెర్రజెండాలై నీ కన్నుల్లో గుచ్చుకుంటున్నాయా? కట్టింది ఖద్దరైనా—కవికుమారుణ్ణి. ఆ పైగా—నీ పాదపద్మాల సన్నిధిని తన హృదయ దీపిక వెలిగించి హారతెత్తిన ఒమర్‌ఖయ్యాం గీతాల మత్తులో తూలే నన్ను చూస్తే నీ కెందుకుభయం! వెన్ను చంచనా!

నువ్వు సముద్రద్వీపంలో నాట్యంచేస్తుంటావనివిని చిన్నతనంనించీ కనపడ్డ ప్రతి "మాపు" భూతద్దాలతో నీకోసం వెదికీ—వెదికీ—వేసారాను. నువ్వు నాట్యంచేసేది మా పుష్పసముద్రానికి యెంతదూరంలో? ఏదిక్కున? ఈకాస్త రహస్యంచెప్పి నా జ్ఞానపిపాస తీర్చి పోరాదు? ఏం—మాట్లాడవు? మూగనోము పట్టావా? ఈ రహస్యం బట్టబయలైతే గాంధీభక్తులు అక్కడకూడా నిన్ను బతకనియ్యరని భయమా?

పోనీ—ఈ మధ్య మా పండితులంతా శకుంతలరాసిన కాళిదాసొకడనీ—నిన్ను వరించిన కాళిదాసింకొకడని — తలకాయలు బద్దలుకొట్టుకుంటున్నారు. ఏమిటి! నీ ప్రియుడే నా శాకుంతలం వ్రాసింది! నీ పాదకమలములు భక్తితో సేవిస్తే కావేటిరంగడి దర్శనభాగ్యం కలుగజేస్తావట నిజమేనా? ఏం, అట్లా కళ్ళెర్ర జేస్తావేం? ఇంత నిర్భయంగా—నిలవదీసి యింటిగుట్టు అడుగుతున్నాదేమనా?

నువ్వు కపిలుని అరవిందానివని—వివేకానందుకు మాతృశ్రీ వనీ, యోగులంటూ, భోగులంటూ మోక్షమునిచ్చే దాయినివని—క్షుభితహృదయాలకి శాంతిదూతవని—వని, జ్ఞానపిపాస తీర్చుకోవాలని అడిగాను. ఈ కాస్త భాగ్యానికి కోపించటం నీలాంటి మాధుర్యదేవతకు తగిందా చెప్పు!

నీలోని రాసిక్యంరేపి, నీతో స్వర్గవీధుల్లో విహరించటానికి రాహాలు. ఏమ్మా, నాలాంటి క్షుభితహృదయునికి కాస్త యింతెక్కువరిసంటో కొంచెం ఆలోచించు. క్షుభితహృదయుడు ఒమర్ ఖయ్యాంచే నెట్టబట్టికాదూ నీకు ప్రపంచంలో పూజ్యత కల్గింది! మోక్ష క్షుభితహృదయులు గో మ యా జు ల మూలంగాకాదూ నీకు యజ్ఞాల్లో పూజ్యత. యింతటింటా నీపారాయన కల్గిందీ! ఆ మహాకవితో, స్వర్గ వీధుల్లో గీతాలు పాడుకుంటూ విహరించటం జ్ఞాపకంవుందా? కంట నీరెట్టు కున్నావేం? ఆ మహారసికుడు పంచభూతాల్లో ఐక్యమైనాక మళ్ళా, నీకన్నీరు తుడిచి, లాలించి, "వలచి వలపించచేర్చిన వన్నెకాడు" దొరకలా? అవును మరి—కవులూ, యోగులూ "కాఫీ కన్య" వలలో చిక్కుకున్నారు. తక్కిన వాళ్ళకి "మధుపాన నిషేధచట్టం" గొంతులో అడ్డుపడింది. కాకపోయినా ఆ బక్కకోమటి దృష్టిలో పడ్డతర్వాత యిక నీకు పుట్టగతులుంటాయా? ఇక నీస్థితి "నానాటికి తీసికట్టు నాగంభొట్లూ!" అవును మరి—మహాత్ముడంతటి వాడు నీమీద గొడ్డలెత్తాడంటే నువ్వేం సామాన్యురాలివా? కాలాంతకురాలివి! ఎక్కడ పాదంపెట్టితే అక్కడ మసేగా?

ఒక్క తండ్రి బిడ్డల్లోనే సురాసురభేదాలు కల్పించి లోకాలకే ముప్పు తెచ్చావా? నీ మూలాన శు క్రా చా ర్యు డి కి చావుతప్పి కన్ను లొట్టయిందా? యాదవవంశాన్ని సకుటుంబ సపరివారంగా నీ పొట్టనుపెట్టుకు నీళ్ళు పోసుకు న్నావా? కీచకుడిప్రాణం సుధేష్ణమానం తీశావు! సకల భోగభాగ్యాలతో కళ కళలాడే యెన్నో దేశాలని, మహా రాజాధిరాజులని దుంపనాశనంచేశావు! ధనికు లనక, దరిద్రులనక నీ పాదాల నాశ్రయించినవాళ్లనల్లా కృతఘ్నురాలవై పాతాళాని కణగదొక్కావు! ఇంతపని చేసినదానిని నిన్ను నెత్తి నెక్కించుకోమంటే యెవ రెక్కించుకుంటారు చెప్పు? కాకపోతే — క్షుభితహృదయాలకి శాంతిదూతను,

ప్రాణప్రదాయినిని అంటావు! కాప్ట్యమేనదు?........ఆ........ఆ మోహావిష్ట తేమిటి!........మాధుర్యం వొలికిస్తూ యేమిటీ అంటున్నావు?........

ఆ...."నీ క్షతవిహ్వలహృదయానికి శాంతిదూతను. రా—రా నా వక్షంలో నిన్ను అదుముకుని, నా అధరామృతంతో నీ హృదయంలో గాయాలిని మాన్పుతా—రా—గీతాలు పాడుకుంటూ స్వర్గవీధులలో విహరిద్దాం రా—రా" అనా!

నిజం! నా హృదయం వుడుకుతోంది! వుడుకుతోంది! క్షోభిస్తోంది! క్షోభిస్తోంది! అయినా—అయినా—ఉడికే నా హృదయపుటంచులను పట్టుకుని, ఆశాదేవి యింకా వేళ్ళాడుతోంది. పైకిరెక్కలు విప్పుకుని ఆశాదేవి శూన్యం లోకి ఎగిరిపోయిన మరుక్షణం—తూట్లుపడ్డ గుండె ఒడిసిపట్టి నీ చరణసన్నిధి వ్రాల్తాను. నీ అధరామృతంతో నా హృదయగాయాల్ని మాన్పుదువుగాని.... అప్పుడు....మధుర మధుర గీతాలు పాడుకుంటూ నందనోద్యానంలో—చేతులు కలుపుకుని—నాట్యంచేద్దాం!....సరేనా....అందాకా........ఇక శెలవు.

---

(కవితాకన్య చిద్విలాసిని, జగన్మోహనమూర్తి, ఆరాధ్యదేవత. ఒమర్ ఖయ్యామ్ ఆమె నారాధించి మహోత్తమ సిద్ధినందాడు. భావౌన్నత్యమేకాక ఇందుకు ప్రధానమైనది భావస్వాతంత్ర్యం. ఎన్నో అభ్యంతరాలను స్వయంగా కల్పించుకుని, భావదాస్యానికి అలవాటుపడి కవికుమారు లీమెను ఖూనీ చేశారు, పూర్తిగా విస్మరించారు. ఒక కవికుమారుని విలాపం ఈ వ్యంగ్యచిత్రంలో ప్రతిఫలిస్తుంది. — సంపాదకులు.)

# కోయిలా!

## అడివి రాధావసంత

పాడవే కోకిలా! పాడవే పాట!
నీ పాట నేటువిం నేనిచట కూర్చుందు
పాడవే కోకిలా
పాడవే పాట!

నీ గొంతులో పాట నీలాల గలిసేను
నీ పలుకు ముత్యాలు నిలువెల్ల హారాలు
పాడవే కోకిలా
పాడవే పాట!

పలుకవే ఒకపలుకు, ఒలుకవే తీపి,
గున్నమామిడి చిగురు వెన్నెలై విరిసింది
పాడవే కోకిలా
పాడవే పాట!
నీపాట నేవింటు
నేనిచట కూర్చుందు!

---

( భారత కవితాసామగ్రిలో మహోన్నతస్థానం కోకిలది. కోకిల మృదు మధురస్వనంవిని మూర్ఛనలుపొందిన ఈ కవయిత్రిఆహ్వానం ఈ పాట.

— సంపాదకులు. )

# వీణా బాల

## అడివి రాధావసంత

### ౧

సంగీతంలోని ఆనందం పూవులోని సువాసనలా ఉద్భవిస్తుంది. నేర్చుకోవడంలో ఆనందం దుఃఖంతో మిశ్రమై ఉంటుంది. మా గురువుగారు తాళం తప్పితే కళ్ళు ఎర్రచేస్తారు. నా హృదయం ఒక్క నిమేషం స్పందనం ఆగిపోతుంది. నా వేళ్ళు మెట్లపై జారుతూ మంటలు పెట్టేవి. గాట్లు పడిననాడు తీగలు మీటడానికి గోళ్ళు పెరగడం ఆలస్యం అయింది.

నేర్చుకునే మొదటిరోజులలో వీణను చూస్తేనే భయమేసింది. కాని సమ్మోహనశక్తితో దగ్గరకు ఆకర్షించేది.

ఈనాడు నా పరమస్నేహితురాలు, ఈ విపంచీబాల ఎంతో అందమైనది. కలశము లతాయుతము, కలశమూర్తి స్వరూపమే మహాఫలాకారంలో ఉంది. వీణాదండము మాధవీలతలా సాగింది. తుంబీఫలము చెరువులో వికసింపబోయే సహస్రదళ కమలంలా ఉన్నది. శిరస్సు సింహకరాళమైనా ఎంత ప్రసన్నవదనము!

ఎందుకమ్మా సింహకరాళం అని నా ఈ బాలికాహృదయంలో ప్రశ్న ఉదయించింది.

మా పితృపాదులు శిల్పభావాలు సమన్వయించడంలో లేత తమలపుటాకును సంతరించినట్లే.

“తల్లీ, సింహకరాళము శారదావీణకే. అది కీర్తిముఖము. కీర్తిముఖము విశ్వసంభావన. విశ్వహృదయస్థ నాదః సర్వ గాంధర్వానికి శ్రుతి. ఆ కళా సమయమే ఈ సింహకరాళం” అన్నారు నాన్నగారు. నాపై వారి మాటలు గంగాజలంలా ప్రవహించిపోయాయి. అంతా తెలిసినట్లే అయినది.

## ౨

కనుచీకట్లలో, సంధ్యవెలుగులో, గంభీరాంధకారంలో నా ఈ వీణామతల్లి సరస్వతీదేవిలా ప్రత్యక్షమవుతుంది.

సారెలు సవరించడంలో నా ప్రత్యేక శ్రుతికోసం లోకమంతా అన్వేషించినట్లే. అనాది విశ్వంలో ఏ నక్షత్రలోకంలో వుందో నా శ్రుతి.

ఎన్ని శ్రుతులో దర్శనమిస్తారు. ఆ శ్రుతిబాలలు గంధర్వ, యక్ష, గరుడ, విద్యాధర, అప్సర, కిన్నెరీబాలలు. వారు చిరునవ్వుల దర్శనమిస్తూ "నేను కానమ్మా, నీ కంఠమాధుర్య సంజాతను. ఇంక కొన్ని పథాలు గడిచిపో" అంటారు.

నన్ని పథాలను కొనిపోయే గంధర్వాశ్వం ఆ సారె.

ఆ సారెకు బంగారుతీగె పగ్గాలు నా ఎడం, కుడిచేత ఆ అశ్వాన్ని అదలించే అమృతరూపకళ, పంచమతంత్రి.

ఎన్ని దివ్యపథాలకు తేలిపోయానే? వేగవంతము, కల, కాకలీ, మందర, మధ్యమ, పంచమనాద మార్గాలుచూపి, ఆ దివ్యాశ్వము ఎగిరిపోతున్నది. నాభికా, అధర్వణీ మొదలైన దివ్యాంగనలు దర్శనమిచ్చి మాయమైపోయినారు.

ఇంతలో ఓ దివ్యలిప్తలో నావిశుద్ధపద్మస్థయైన కంచిపీ శ్రుతిదేవి ప్రత్యక్షమై నన్ను గాఢంగా కౌగలించుకుంది.

కన్నులు తెరచి నా వీణాబాలకు నమస్కరించుకొన్నాను.

## 3

వీణాదేవి మేఖలారుచితో, శ్రుతితీగలు మూడు ప, ప, స స్వరాలై, త్రివేణీ సంగమమై నా హృదయంలో ప్రయాగ అయినది. సారెలు సవరించుకొని షడ్జమ తంత్రితో తక్కిన తంత్రులు సవరించుకొని అఖండశ్రుతికై గుళ్ళు సవరించి మేళవించుకొన్నాను.

ప్రీతే నాదమై, నాదమే ప్రీతై, నాదమే రాగకల్పనై, స్వరాలాపనై, నాదమే నాదమై నా గురుని ప్రియవీణాగానపు తైవశ్యమున నా హృదయం నాదంలో లయమైపోయింది.

ఎక్కడున్నదమ్మా వీణాబాలా నీలో ఈ దివ్యామృతప్రపంచం?

హిమాలయాలు సంచరించాను. కేదారగౌళలో పంచమరాగంలో అద్భుతాటవులు, హనుమత్తోడిలో పండువెన్నెలలు, శంకరాభరణంలో ఆకాశగంగను నాలో లయించుకొన్నాను.

ఇవి ప్రసాదించిన నా వీణాబాల, నా వాణి నాలో ప్రత్యక్షము.

ఆమె నా జీవితంఅంతా నిండిఉన్న నా ఎదుట, తీగలతో, మెట్లతో, ప్రసన్నమూర్తియై లోకాద్భుత ప్రభలన్నీ రూపంపొంది నా ఎదుట పవళించి వుంటుంది.

వీణాబాలా, నా దేవీ, నా సఖీ, నా ఆత్మా, నమోవాకాలు.

---

(ప్రాచీన భారత జంత్రాలలో వీణ తలమానికం. సరస్వతీదేవికి ప్రియతమ వాయిద్యం. మానవ శరీరమునే మేలుబంతిగా తీసుకుని వీణానిర్మాణం ఆదిలో జరిగిందని కొందరు లాక్షణికులమతం. ఏదైనా వీణాస్వనానికి హృదయం స్పందించని మానవు లరుదు. వీణానిస్వనం తన హృదయంలో రేపిన భావాలనూ, చిత్రాలనూ రాధావసంత చక్కని శైలిలో వర్ణించింది. రాధావసంతకూ, వీణకూ గల సన్నిహితత్వం, తద్వారా ఆమె హృదయపరిపక్వం ఈ రచనలో గోచరమౌతాయి. ఈ రచన గద్యమూ, గేయమూ, వీణతంత్రీ నిక్వాణమూ!

— సంపాదకులు.)

# ౨౮

# తరాళికాభాషణ్

నీకు హృదయంలేదు.
నాకు జ్ఞానంలేదు.
నీకు వయసులేదు.
నాకు బలంలేదు.

నేనే నీకు లభ్యమయ్యానా? నాలోని స్థిరసత్వం హృదయంలేని నీ కెలా అవగతమయింది?

నీ వయసులేనితనానికి నన్ను బాధించగలిగేశక్తి ఎక్కడనుంచి లభ్యమయింది?

నీ వెక్కడనుంచి వచ్చావు? ఎందుకువచ్చావు? నికేమైనా కావాలా?

నేను నీ రాకకోసం ఎదురుచూచాను. నా హృదయం సంతోషంతో ఉప్పొంగుతూఉంటే నిన్ను కనుక్కున్నాను.

నన్ను బాధించడానికి శక్తి కలిగిన నీకు నా హృదయంలోని మహత్తర పరిణామం తెలుసుకునే సాధనసంపత్తిని చేర్చుకుందుకు అగత్యం లేకపోయిందా?

నిన్న నీ వెక్కడ? ఈరోజు నీ వెక్కడ?

నీ రాకకోసం తపించిన నేను నీవు కనపడగానే నీవంటే విముఖత పొందలేదేమి?

నిన్ను దూరంచేద్దామనికాని, నీవు నా సౌఖ్యానికి అంతరాయ మౌతావేమోననికాని, నీవు నా జీవితానికి మరొక బాధ్యత కల్పించావనికాని భావించి నేను ముఖాన్ని త్రిప్పుకోలేదు.

మానవజాతిలో సర్వసామాన్యంగా ఉండే, నూతనత్వాన్ని నిరసించేభావం నా దరికి చేరడానికి భయపడి పారిపోయింది.

నీవు వస్తావని తెలియకముందు నీ రాకని మనసారా కాంక్షించాను. నీవులేని నా జీవితానికి సంపూర్ణత్వమే లేదని తలచాను. నీకోసం తపస్సు చేసాను.

నీవు వస్తున్నావా లేదా అనే శంకలోనే ఎంతో ఆనందం ఉందేమో! చిరకాలవాంఛితం ఈడేరడంకన్న వాంఛించడంలోనే పరమానందం ఉందని తెలుసుకొని, నా జీవితానికికూడా అటువంటి మహత్తరావకాశం దొరికిందని సంతసించాను.

ఇదంతా కల కాదుకదా అనీ, నీవు సరిగా నా వద్దకు రాలేవేమోననీ, నీ రాక సుఖప్రదం కావాలనీ, నిన్ను చూచి రెట్టించిన ఆనందంతో నిన్ను సుఖపెట్టి నేను సుఖపడాలనీ వాంఛించాను.

నీ రాకలో ఎంత బాధ, ఎంత ఆనందమూ మిళితమై ఉన్నాయి?

ఆ ఆనందంలో ఉండే ఉదాత్తత బాధపడకపోతే ఎలా తెలుస్తుంది?

జీవితమే బాధ, ఆనందం కలిసిన స్వప్నం.

ఏది ఎప్పుడువస్తుందో, ఎంతకాలం ఉంటుందో మనకి తెలియదు.

మార్పు చివరకి కలగవచ్చుననే ధైర్యంకూడా నశించిపోతూఉంటుంది మనలో ఒక్కొక్కప్పుడు.

జీవితంలోని వైచిత్ర్యమేమంటే మనం రెండింటినీకూడా సహించ కలుగుతున్నాం.

సంతోషంలోనే బాధ ఉంది, కష్టంలోనే మాధుర్యంఉంది అని భావించడం కూడా పరిపాటి అయిపోతుంది.

నిత్య నిరంతర సంతోషభగ్నుడైనవానికి జీవితంలో మాధుర్యం ఏముంది చెప్పు?

అమరసౌఖ్యమే అరచేతిలో ఉన్నప్పుడు సౌఖ్యానికి విలువ ఏముంది?

ఏ స్థితిలోఉన్న మానవుడైనా మార్పునే వాంఛిస్తాడు.

నీవులేని నా జీవితం నీవు కావాలని కోరడం సరియైనదేకాదా?

కాని నిన్ను తిరిగి విడిచిపెట్టే మార్పుసు నేను తలపనైనా లేకపోయా ననేనా నీవు నన్ను లోకువగా చూసినది?

నీవు వచ్చావు. చూచాను.

వాంఛితపదార్థానికి మానవుడు కొన్ని లక్షణాలు, స్వరూపం, కల్పించుకుంటూ ఉంటాడు. అది సఫలం కాకపోయినప్పుడు భగ్నహృదయుడౌతాడు.

నేనుమాత్రం నిన్నుగురించి ఎందుకు కలలు కనకుండా ఉండుకుంటాను?

కలకనడంలోనే తృప్తిచెంది, వాస్తవత్వాన్ని ఆసహ్యించుకోవలసిన అవసరంకాని, విరసించవలసిన కారణంకాని లేక, ఊహించినదానికన్న ఎక్కువగా ఫలితమున్నప్పుడు ఎవరి ఆనందమైనా ఏ స్థితిలో ఉంటుందో నీ కెలా తెలుస్తుంది?

నీవు నన్ను చూచీ చూడగానే నా సంగతి తెలుసుకున్నావా? అందుకా చిరునవ్వు నవ్వావు? గర్వంతోనా కిలకిలలాడావు?

నిన్ను చూడకపూర్వమే, నాకు తెలియకుండానే నా హృదయం నీ వశమైంది.

పూర్తి పరాజయాన్ని నిన్ను చూచేటంతవరకూ అంగీకరించదలచుకోలేదు నేను, వెర్రివాణ్ణి!

నిన్ను చేతులుచాచి అందుకున్నాను. తవివార హృదయానికి హత్తుకున్నాను.

నావద్దనుంచి ఒక్క క్షణమైనా దూరం పోవడానికి ఇష్టంలేక నీవు చేసిన తిరుగుబాటు, చూడు, నా హృదయంలో ఎంత పదిలంగా భద్రపరచి దాచుకున్నానో!

ఇప్పుడదేనా నాకు మిగిల్చావు?

నీవు వెళ్ళిపోయావని వినడమేకాని, అదికూడా చూడలేకపోయిన నిర్భాగ్యుణ్ణి నేను.

నీ వెందుకు వచ్చావో, ఎందుకు వెళ్ళావో నాకు తెలియదు.

సముద్రంలోని ప్రవాహాలు నిరంతరం మహావేగంతో ప్రవహిస్తూ ఉంటాయి. వాటి అలలు మధ్యనున్న కఠినశిలని స్పృశించి, కౌగలించి, ముంచెత్తి విడవలేక విడిచి తిరిగీ ఆ మహావేగంలో కలిసిపోతూనే ఉంటాయి.

నీవా ప్రవాహంలో ఒక నీటిబిందువువు. నేనో కఠినశిలని.

నా హృదయంలో ఆరని చిచ్చు రగుల్కొల్పావు. నిన్ను మరచిపోను, మరచిపోలేను.

పాపా! నేను మూర్ఖుణ్ణి.

---

(ప్రకృతి మాతనత్వం కోరుతుంది. ప్రేమఫలం కోరుతుంది. ప్రేమఫలం కోసం ప్రపంచ స్త్రీ పురుషుల పరితాపం, ఫలం హస్తగతమైనాక దానిని క్షణమైనా విడువకుండా కాచుకుని నేత్రపర్వం చేసుకోవాలనే ఆకాంక్ష, ఆ ప్రేమఫలం మాతాపితలను విడువలేక, విడువలేక, ప్రకృతిదోషంవల్ల ప్రియుని వెతుక్కుంటూ సాగిపోవడం తలిదండ్రుల హృదయాల నెంతగా గాయపరుస్తుందో యీ రచన వెల్లడిచేస్తుంది. మానవహృదయంలో మారుమూలల సాగివుండే వాంఛలను సువ్యక్తంచేశాడు తూలికాభూషణ్. రచన నూత్నఫక్కీలో నడిచింది. వ్యంగ్యం పరాకాష్ఠకు వెళ్ళింది. — సంపాదకులు.)

మనస్తత్వం :

# "హోటల్ బోయ్"

## తూలికాభూషణ్

## ౧

స్వంత వ్యవహారమైతే చూచుకోవచ్చుగాని జమీందారుగారి వ్యవహారాలేమో కాకినాడలో ఎప్పుడున్నా ఆంధ్రా హోటల్లోనే నా మకాం.

హోటలు యజమానికీ, నాకూ ఏర్పడిన స్నేహాన్నిబట్టి నేనున్నంత కాలమూ నా సదుపాయాలు చూడడానికీ, క్రిందనుంచి భోజనం, టిఫిన్ వగైరా తెచ్చిపెట్టడానికీ, చిల్లరపనులకూ ఓ హోటలు కుర్రాడు ఎప్పుడూ నా దగ్గరే ఉండేవాడు.

రాములు వాడి పేరు. అంతా రాములూ అని పిల్చేవాళ్ళు. పది సంవత్సరాలుంటాయి. చాలా ఓపికగా, చిరునవ్వుతో, తెలివితేటలతోనూ అన్ని పనులూ చేసేవాడు.

నాకు పిల్లలంటే చాలా ఇష్టం. పనిచేస్తూన్నంతసేపూ, ఖాళీ సమయంలోనూ వాడితో బాతాఖానీ చేస్తూఉండేవాడిని.

నాకు తెచ్చిన క్యారియల్‌లో మిగిలిన తిండి నేనుండేరోజుల్లో తినేవాడు.

దాదాపు ఏణ్ణర్థం ఈవిధంగా గడిచిపోయినా నాకు వాడినిగురించిన ఆలోచన అంతగా మనస్సుకు పట్టలేదు.

కలెక్టరాఫీసులో కొన్ని కాగితాలకు నకళ్ళు తీసుకోవలసివచ్చి నేను కాకినాడ వచ్చాను.

మొదటిరోజున రాములు కనపడలేదు. మరి వక కుర్రాడు భోజనం అదీ తెచ్చిపెట్టాడు. పనితొందరలో మరి ఈ విషయంపై దృష్టిని ఉంచలేకపోయాను.

రెండోరోజునకూడా ఇలాగే జరిగింది. యజమానిని అడగ్గా వాడికి జ్వరం వచ్చిందని తెలిసింది. హోటల్లోనే ఉన్నాడనీ, వాడి తల్లికూడా అక్కడే పని చేస్తోందనీ తెలిసింది.

అందుతో వాడి చరిత్ర తెలుసుకోవాలని కుతూహలం కలిగింది.

రాములు తండ్రి విశాఖపట్టణం జిల్లావాడు. చిన్నప్పుడే కాకినాడ వచ్చేసి ఇక్కడే బండి తోలుకుంటూ గాంధీనగరంలో ఉండేవాడు.

పోతురాజు చనిపోయేప్పటికి రాములుకి నాలుగేళ్ళు. వాడి తల్లి సోమాలు హోటల్లో పనికి కుదిరింది. వీడుకూడా అక్కడే పని అంత చిన్న వయసులోంచి మొదలుపెట్టాడు.

వాళ్ళకు రెక్కలు తప్పించి మరే ఆధారమూ లేదు.

నాకు వాడి పరిస్థితిచూసి జాలి కలిగింది. నాకెలాగూ ఒక నౌకరు అవసరం.

అందుచేత రాముల్నే నావద్ద పనికుంచుకుని జార్జిపేటలో వాడికి చదువు చెప్పించి, అక్కడనుంచి హైస్కూలులో కాకినాడలో చేర్పించి వాడి కేదైనా ఆధారం చూపిద్దామనుకున్నాను.

ఈ విషయం సోమాలుతో చెప్పించి, అంగీకారంపొందాను. హోటలు యజమానికూడా అంగీకరించాడు.

తర్వాత రెండు రోజులకు రాములు జ్వరంతగ్గి ఎప్పటిలాగే పనిలోకి వచ్చాడు.

రాముల్ని అడిగాను చదువుకుంటావురా, అని.

"నాకు చదువెందుకండి, బాబయ్యా" అని వాడి సమాధానం.

"అదేమిట్రా, చదువుకుని ఏదైనా మంచి ఉద్యోగం సంపాదించుకో వచ్చుమరా" అన్నాను.

వాడు మాట్లాడలేదు.

"నేను చెప్తావులే. నాదగ్గరే ఉండువుగాని" అన్నాను.

అప్పటికీ వాడి దగ్గర్నుంచి జవాబులేదు.

తిరిగి దానికే రెట్టించి అడిగాను. సమాధానం రాకపోవడంతో విసిగి "నీకు చదువుకుందుకు ఎందుకు ఇష్టంలేదురా?" అని ఆఖరిప్రశ్న వేశాను.

దానికూడా వాడు నసిగి, నసిగి, "మరి ఇక్కడ పని ఎవరుచేస్తారు బాబయ్యా" అన్నాడు.

అదీ వాడి అనుమానం.

తాను హోటలు విడిచిపెట్టిపోతే ఈ పనిఅంతా ఎవరుచేస్తారు. చెయ్యకపోతే పాడైపోదా, అని.

కలెక్టరాఫీసులో పని కాగానే రాముల్ని బలవంతంగా నాతో జార్జిపేట తీసుకుపోయాను.

దారిపొడుగునా రాముడు మౌనంగానే ఉన్నాడు. నేనుకూడా వాణ్ణి అట్టే పలకరించడంకాని, మాట్లాడ్డంకాని చేయలేదు. అలాగే జార్జిపేట చేరుకున్నాము.

## ౨

ఒక స్థితిలోఉన్న వ్యక్తి మరోస్థితిని అర్థంచేసుకుని, ఆ వాతావరణానికి తగినట్లుగా కావడానికి కొంతకాలం అవసరంకదా అని నేనెన్నడూ తిరిగి రాముణ్ణి పరిశీలించలేదు.

ముసలినౌకరు వెంకన్న, దాసీది పద్ది, కుక్క, రాముడు, నేనూ మా జార్జిపేట సంసారం.

ఇటేడు తరాలు, అటేడు తరాలు ఎవరూలేరు నాకు.

ఊళ్ళో ఒక చిన్న బోర్డు ఎలిమెంటరీ స్కూలు ఉంది. దానికి హెడ్మాష్టరు వెంకటసుబ్బయ్యగారు. కాస్త ఇంగ్లీషుముక్కలుకూడా చెప్పగలడు. ఆయన్నే రాములికి ప్రైవేటు మాష్టరుగా పెట్టాను.

జార్జిపేటలో పని ఏమీలేక ముప్పొద్దులూ తిరగడం. చదువుకోవడమూను.

నాకైనా స్వంతంగా వంట వగైరా బాదరబందీ ఏమీలేదు. జమీందారుగారి ఇంట్లోంచి నాకు భోజనం వచ్చేది. అదే నేనూ, రాములూ తినేవాళ్ళం.

జార్జిపేట రాగానే రాములికి మంచి బట్టలు కుట్టించిపెట్టాను.

జార్జిపేట వచ్చినతరువాత రాములులో సంతోషం చూడలేదు.

ఆ తరువాత రెండు నెలలవరకూ నేను తిరిగి ఏ ఊరికీ వెళ్ళలేదు. అనారోగ్యంవల్ల.

ఈ రెండు నెలలూ రాములే ఇంత ఉపచారం చేసాడు. వెంకన్నకి తాను చేయవలసిన పనులు వీడు చేస్తున్నాడే అనే బాధకూడా కలిగించాడు. కాని రాములు నాకు ఇష్టమైనవాడు అన్న సంగతి తెలుసుకుని వెంకన్న దానికేమీ అభ్యంతరం చెప్పలేదు.

మాష్టరు ఏదో చెప్పిపోతూ ఉండేవాడు. రాములు చదువువిషయంలో మాత్రం ఎప్పుడూ ఏమీ సందేహాలు కాని, ప్రశ్నలు కాని నాకు చెప్పలేదు.

నేను నడవపల్లి వెళ్ళవలసివచ్చింది. ఆసంగతి వెంకన్నకిచెప్పి, రాముల్ని చూస్తూ ఉండమన్నాను.

ఆసారిమాత్రం రాములు ఉత్సాహంగా నా ప్రయాణపు సామాను అదీ సర్ది నాతో యానాంవరకూ కూడావచ్చాడు.

జాగ్రత్తగా ఉండమనీ, చదువుకోమనీ చెప్పి నేను పడవ ఎక్కాను.

రాములు అన్నింటికీ చిరునవ్వు నవ్వి అంగీకారం తెలిపాడు.

## 3

నేను తిరిగి వచ్చేప్పటికి వారంరోజు లయింది.

రాములు లేడు.

నేను జార్జిపేటనుంచి వెళ్ళినమర్నాడే రాముడు వెళ్ళిపోయాడు. ఎక్కడికి పోయాడో ఎవరికీ తెలియదు.

వెంకన్న జార్జిపేటలోనూ, చుట్టుపక్కల గ్రామాలలోనూ, యానాంలోనూ వెతికించాడు కనపడలేదు.

వెళ్ళేటప్పుడు రాముడుకూడా ఏమీ తీసుకుపోలేదు. వాడు నాతో జార్జిపేట వచ్చేటప్పుడు తొడుక్కునివచ్చిన లాగు, చొక్కాలుమాత్రం లేవు.

ఎవరికీ ఏమీ తెలియదు.

ఆ వెంటనే నేను కాకినాడ తిరిగి పడిమీద ప్రయాణమయాను.

దారిలో కోరంగి పోలీసుస్టేషన్‌వద్ద ఆగి అక్కడ రాముడుసంగతి రిపోర్టు ఇచ్చి, వాడిని వెతికించమని సబ్ ఇన్‌స్పెక్టరుతో మరీ మరీ చెప్పి, తాళ్ళరేవులో కూడా ఎంతమంది స్నేహితులతో ఈ ఉదంతాన్ని చెప్పి కొంచెం వాడికోసం ఆచూకీ తియ్యమన్నాను.

కాకినాడపోయి సోమాలు కేమనిచెప్పను?

దారిలో ఈ ఆలస్యాలతో నేను కాకినాడ చేరుకునేప్పటికి రాత్రి పన్నెండు గంట లయింది. అలిసి ఉండడంవల్ల హోటలుకు చేరినవెంటనే నిద్రపోయాను.



తెల్లవారి నిద్రలేచి చూచేప్పటికి, బల్లమీద కాఫీప్లాస్కు, టిఫిన్ పళ్ళాలతో చిరునవ్వుతో తల వంచుకుని నిలబడిఉన్నాడు రాముడు!

---

(బాల్యంలో జీర్ణించిన అలవాట్లలోనే దృక్పథంలోనే ఆనందం అనుభవించ గల మనుకోవడం మానవ సహజం. వాటిని దాటి దృష్టి సారించి నూత్న జీవితానికి మరలేందుకు హృదయం తిరుగుబాటు చేస్తుంది. ప్రపంచం దృష్టిలో వంకరైనా వ్యక్తి దృష్టిలో అది పట్టెమంచం. ఇదే ఈ కథకు మూలసూత్రం.

— సంపాదకులు.)

# మా తాతయ్య

## తూలికాభూషణ్

మా తాతయ్యకాలంనుంచి ఇప్పటివరకూ ప్రపంచం పురోభివృద్ధి చెందిన విషయాలు పరికించిచూస్తే ఇట్టే ప్రేమ, అభిమానం అని తట్టుతాయి.

మా తాతయ్యకి కాలం లేదని వాదించే పండితులు, చరిత్రకారులు లేకపోలేదు. ఇప్పటికేకాదు ఎప్పటికీ మా తాతయ్యకాలాన్ని సరిగ్గా నిర్ణయించుకోలేక యుద్ధాలుచేసే శాస్త్రకారులుంటారు.

ఏది ఎలా ఉన్నా మా తాతయ్య రాతియుగంనుంచీ ఈ యుగందాకా, ప్రపంచం ఉన్నంతకాలమూ నిజమైనవాడే.

ఆయన సాలుకి ఇరవైమూడు తద్దినాలు పెట్టేవాడు. అందులో ఆయన మాతామహుడు, పితామహుడు, తండ్రి, తల్లి, మేనమామలు, మేనత్తలు, మామగారు, అత్తగారు, మామగారి తండ్రి, తాత, ఇంకా ఎంతమందో ఉన్నారు.

ఇంత మందికీ, ఇన్ని వంశాలకీ ఈయన ఒక్కడే వారసుడు. మరి దేనికీ కాకపోయినా తద్దినాలకైనా పనికొస్తుంది.

ఏ తద్దినానికి కాదగ్గరమే "ఒరేయ్, ఇది పెట్టకపోతే ఎలాగరా, ఆయనకి నేనంటే ఎంత అభిమానమో తెలుసా?" అనేవాడు.

"మా మేనత్తలాంటి మనిషి ఉందిరా? ఆవిడ నిజంగా అన్నపూర్ణకదూ, రేపు ఆవిడ తద్దినానికి రెండు పనసకాయలు తెప్పించు" అనేవి.

మనుష్యులు బ్రతికి ఉన్నంతకాలమూ ఎలాగా తద్దినం తప్పదుకదా, చచ్చినతరువాతకూడా అదే తద్దినం ఎందుకు తెచ్చిపెట్టుకోవాలి అని మనవాదన.

ఒకమాదిరి సకారనుకి ఉన్నవాడు ఎవడైనా కనుపించాడా, వాడి పుట్టుపూర్వోత్తరాలు, వంశగోత్రాలు, ఊరిపేరు ఇంటిపేరుతోసహా, ఇంకా మాతామహ, పితామహాల జీవిత చరిత్రల సంగ్రహమూ తెలుసుకుని ఎక్కడో "మన రామయ్యతాత మేనత్తకి అమ్మమ్మ ఇనిమనుమడే కదూ వీడు? మీ తాతయ్య చెల్లెల్నికనుటోడ్ మా పినతాతగారి మేనమామకొడుక్కి ఇస్తే?" అనేదాకా, అతణ్ణి యింట్లో వారంరోజులవరకు ఉంచితేగాని తృప్తిపడేవాడుకాదు.

"చూడాలోయ్, వెంకమ్మపిన్ని కూతురు పెళ్ళికి రామవరం వెళ్ళినప్పుడు సుబ్బయ్యమామ, కొడుకులు ఎంత ఆదరంచూపెట్టార్రా! మన మేంచేసాం, ఏమిటో!" అని ముత్తవ్వకాలంనాటి సంగతుల్ని నేటివిలాగా చెప్పుతూ ఉండేవాడు.

ఆయనకి ఆంధ్రదేశం ఈ మూలనుంచి ఆ మూలదాకా ఎక్కడెక్కడ మంచి వంకాయలు, పుల్లగోంగూర, పిండి పనసకాయలు, మంచి నల్లేరు, ఉస్తికాయలు, గంగాబొండాలు దొరుకుతాయో క్షుణ్ణంగా తెలుసు.

శృంగారం విషయం ఎత్తకూడదు. తానూ ఆ విషయాలల్లో గోప్యమే, తనవారూ గోప్యమే.

ఎప్పుడైనా సుష్టుగా భోజనం (తద్దినం) చేసి, దిట్టంగా దొట్లుగిట్లూ పెట్టి గంధం ఒళ్ళంతటికీ పూసుకుని, కమ్మని లంకపొగాకు చుట్ట స్వయంగా చుట్టుకున్నది వెలిగించి తాపీగా ఉమ్ములు వేసుకుంటూ అందరితోనూ వీధి అరుగుమీద స్వయంగా జములునేసిన తాటాకు చాపమీద కూర్చుని, ఎడంచేతి మునివ్రేళ్ళతో ఠీవిగా మీసాల్ని కోరగా దువ్వుతూ శృంగార రసంలోకి మనస్సుని పంపించి, గతించిన సుఖ సంఘటనలని ఏకరువుపెట్టేవాడు.

వాటిల్లోనైతం తన పాత్ర ఏమిటో, తాను చేసిన ఘనకార్యాలేమిటోమాత్రం ససేమిరా ఛప్తే చెప్పేవాడుకాదు.

"నల్లసాని మన వూళ్ళో మేళం కట్టినప్పుడు వెంకట్రాజు (ఎదురింటివాడు, పెద్దమనిషి, విశేషించి స్నేహితుడు) ఏం చమక్కులు చేసాడురా! ఒక్క రాత్రికి

వెయ్యినూట పదహార్లు ఇస్తానంటే వచ్చిందిరా అది! ఏంచేసాడనుకున్నావు! ............" అంటూ వెంకట్రాజుగారి సాహసం, వారి సరసాలమీద ఘాటైన ఉపన్యాసం.

"మరి అయితే, తాతయ్యా, నువ్వెప్పుడూ ఎవరితోనూ మాట్లాడనైనా లేదా ఏమిటి, ఊరికే కోసేస్తున్నావు" అని చనువుగా అంటే "ఆరి, వెధవా! ఎంత మాటన్నావురా, చాల్లే ఇంక ఊరుకో" అంటూ సంభాషణని మళ్ళించేసేవాడు.

పోనీ ఈయనగురించిన వివరాలు ఇంక ఎవరిద్వారానైనా తెలుస్తాయా అంటే అది సున్న.

ఆ వెంకట్రాజుగారినే ఈయన చెప్పినవి నిజమౌనో కాదో అడిగి తెలుసుకుందామంటే ఆయన "కరణంగారు ఎప్పుడూ అంతే, చిలిపిమనిషి" అనడమేగాని నిజమనికాని, అబద్ధం అనికాని ఎప్పుడూ తేల్చేవాడు కాదు.

ఏ పూర్వకాలపు ముసలినౌకరైనా అయితే "ఆబ్బో కరణంగారే, మా భలే మనిషండి బాబయ్యా, ఏంచెప్పను, ఏంచెప్పను ఆయన యిసేసాలు" అనే కాని ఇంకేమన్నా చెపితేనా?

ఎవడైనా దూరానికిపోయి ఇంటికి తిరిగివస్తేచాలు అక్కడేమేమి తిన్నాడో, ఏంసరుకులు (తినేవి మాత్రమే సుమండీ) లభ్యమౌతాయో, అక్కడ సన్న బియ్యం అసలు దొరుకుతుందో లేదో, దాని ధర మన ఊళ్ళోధరలకి ఎంత దూరంలో ఉందో ఇవన్నీ పూసగుచ్చినట్లు చెప్పాలి.

ఇందులో ఆయన మతానికి సరిపడనివి ఏమైనా ఉన్నాయాఅంటే మనకి ఇంక మళ్ళి ఆ ఊరికి వెళ్ళడానికి ఆయన ఎప్పటికీ అనుమతి ఇయ్యడన్న మాటే.

కొడుకులు, కూతుళ్ళు, మనమలు, మునిమనమలు, ఇనిమనమలు అంతా తనదగ్గర ఉండవలసినవాళ్ళు, ఆయన్ని వదిలిపెట్టి ఎక్కడికీ వెళ్ళడానికి వీల్లేదు. ఎవరైనా స్వతంత్రించి వెడదామంటే "ఒరేయి ముసలాణ్ణిరా, నేను పోయిం తరువాత వెడుదువుగానిలే, అంతవరకూ ఓపికపట్టు నాయనా" అనేవాడు.

మళ్ళీ డబ్బువిషయంలో చిక్కున. ఖర్చు అంటే ఇష్టం. అట్టే ఖర్చు పెడుతున్నాడని ఎవరూ అనుకుందుకు వీల్లేదు. పెత్తనం స్వయంగా ఆయనదేగా మరి! “నెయ్యి తెప్పించాలి తాతయ్యా” అంటే “ఆరి నీతస్సా దవలా! అప్పుడే మఱుగునెయ్యి అయిపోయిందిరా” అనేవాడు. అప్పుడే అంటే నెల అన్నమాట.

కొంపనిండా మనుష్యులు. చద్దెన్నాలలోకి ఒంటెద్దు బండిమీద నెయ్యి బిందెలతో వస్తేకాని సరిపోవు.

ఇంకా పైన ఎవరితోనైనా మాట్లాడితే “ఈ కాలపు వెధవలు తినలేరండీ. సూరయ్యబాబూ, నీకు జ్ఞాపకంలేదూ, మన చిట్టిగాడి పెళ్ళికి ఎంత నెయ్యి అయింది? ఆసారి పట్టింపులకొద్ది ఎవరూ రాలేదుకనుక అయిదు రోజులకీ ఇరవై మఱుగు లయిందిగాని లేకపోతే...........” అనేవాడు.

తినాలి, తిన్నట్టు కనపడకూడదు—దృష్టిదోషం మహాచెడ్డది.

మనకి పనికిరాని ఎవరిమీదైనా ఆయనకి కోపం కలిగించాలంటే ఆయన ఇంటికి పోయినప్పుడు భోజనానికి పిలవలేదనో, మనం తిండిలేకుండా వచ్చేయవలసివచ్చిందనో చెప్పుతేచాలు.

ఇదిమాత్రం ఎంతకాలం? తిరిగి ఆయన్ని కలుసుకున్నప్పుడు ఎప్పుడైనా ఈ విషయాన్ని అడిగి నికరం తేల్చుకునేదాకానే.

కోపాలూ, తాపాలూ తాత్కాలికమే. ప్రేమ, అభిమానం మాత్రం ఎప్పటికీని.

ఆయనకి కాఫీ ఉప్మాలు పనికిరావు. ఇష్టంలేదు. చద్దెన్నం ఆవకాయ వేసుకుని వెన్న, పెరుగులతో కమ్మగాతింటే ఉండే హాయి, బలం వీటితో ఎలా వస్తాయి అని ఆయన అనుమానం.

ఇగో అంతా తాగుతున్నారులే, ఇప్పుడు మన తాసీల్దారుగార్ని చూడు అన్నామా వాడికేమిటిలే, భ్రష్టుడు, వర్ణంలేదు, వల్లకాడులేదు, మాలకూడు తినే ముండాకొడుకు అని కసురుకునేవాడు.

మళ్ళీ ఏ మాటవాడన్నా ఆయనకి తాసిల్దారుగారికంటె గౌరవమే. వీడికో నీతి, నియమమూ ఉంది. ఆ తాసిల్దారు కేముంది?

ఏ ఊరైనా ప్రయాణానికి వంపించేవాడు ఆయనే ఒక్కొక్కప్పుడు. దారి ఖర్చు లెక్కవేస్తూంటే బస్సు, కార్లు, ఖర్చు ఆయన కంటికి దుబారా.

"మా చిన్నప్పుడు నగరానికి పోవాలంటే బసు ఉన్నాయా, కార్లున్నాయా? వెధవ్వి అన్నీ వచ్చిపడి దేశాన్ని పాడుచేస్తున్నాయి" అనేవాడు.

నగరం మా ఊరికి ముప్పైమైళ్ళు. చద్దెన్నం తిని మూడు చుట్టలు కాల్చేప్పటికి నగరం వెళ్ళిపోయేవాడట. అక్కడ పని చూసుకుని సాయంత్రం భోజనానికి ఇంటికి రావలసిందే. అక్కడ పచ్చి మంచినీళ్ళన్నా ముట్టుకుంటేగా!

చెప్పులజోళ్ళు పొలంలో మాదిగాడు ఏడాది కొకటి ఇస్తే ఏడాది దానికి మరమ్మత్తులు చేయించుకుంటో, ఆ కిర్రుజోడుని, ఆ మీసాలజోడుని తొడుక్కోవలసిందేగాని మళ్ళీ మాటాడ్డానికి వీల్లేదు. ఏడాదీ గడిచినతర్వాత మన అదృష్టం కొద్దీ వెంటనే ఏదున్నపోతైనా ఛస్తే దాన్ని వాడు జోళ్ళుకుట్టి మనకిస్తే కద్దు. దున్నపోతు చావడానికి ఆలస్యంచేస్తే మనపని చెప్పుకోవలసిందే.

ఈ బూడ్సులు, కోట్లు, షైలు, డ్రాయర్లు ఆయనకి అసహ్యం. మంటాను. ఆయన 98 సంవత్సరాలు వీటిని ఉపయోగించకుండా, పట్టి పంచె, కండువా, తలపాగాతో శుభ్రంగా, దిట్టంగా గడిపేసాడాయన.

మరోవిషయం ఏమంటే ఆయనకి ఆదర్శపురుషుడు అంటే ఆయనకాలానికి మరో ఏభై సంవత్సరాలు వెనకాల ఆయన అజానుబాహుడు, కండువాకూడా ఉపయోగించలేదంటే మనని ఎలా సహించకలడు మా తాతయ్య?

ఆయనకి తెలియని విషయాల్ని ఆయన ఎప్పుడూ తెలుసుకుందుకుకూడా ప్రయత్నించలేదు. అంతే వాటికి అంత దూరంలోనూ ఉండవలసిందే. తాను వాటిని ఆమోదించనూ లేదు, అంగీకరించనూ లేదు.

ఎప్పుడైనా మహాకోపం కలిగితేమాత్రం ఈ ప్రపంచం ఎలాగా తనలాంటి వాళ్ళు లేకపోతే, ఇలాంటి పెధవపనులు జరక్కుండా ఆపేవాళ్ళన్నమాట, తప్ప కుండా నశించిపోతుందనీ, దీనికి పుట్టుగతులు ఉండవనీమాత్రం ఆశీర్వదించేవాడు.

నూతన విషయాలు అంటే ఎంత అయిష్టతో, పాత విషయాలు అంటే అంత ఇష్టమూ, గౌరవమూను.

ఏమైనాసరే, అవి చేసితీరాలి.

ఆయన కళ్ళముందర ప్రపంచంమాత్రం ఈ రెండు భావాలలోకిరాదు. అది వట్టి తెలివితక్కువదీ, మూర్ఖపుదీని.

ఎవరికైనాకానీ కష్టం వచ్చిందని విన్నాడా ఏదో చేసేదాకా, ఆయనకి మతి ఉండదు. వాళ్ళు ఎవరైనాసరే "మనం చెయ్యకపోతే, ఇంక ఎవరిక్కావాలిరా" అనేకాని ఆలోచన ఇంకోరకంగా పోయేదికాదు.

ఇక ఎవరికైనా ఏ విషయంలోనైనా ఏమైనా చేస్తానని అన్నా, అనుకున్నా చేసి తీరవలసిందే. రెండోమాట లేదు.

బాధ్యత అనుకున్నదానిని ఎవరైనా చెయ్యకపోయినా, తప్పించుకుందుకు ప్రయత్నించినా మరి వాళ్ళమీద జీవితాంతం కోపమే.

ఇప్పటి పరిస్థితులు చూస్తూఉంటే మా తాతయ్య చచ్చిపోయాడేమో అనిపి స్తుంటుంది ఒక్కొక్కప్పుడు. కాని, మా తాతయ్య శాశ్వతుడు!

---

(తరానికీ తరానికీ గుణగణాలలో దృక్పథంలో భేదం కన్పిస్తూనేవుంటుంది. అంతస్థులో తేడా, అంతే. తాతయ్య పూర్వకాలపు మనిషి, అయినా నిత్యుడు. ఈ రెంటికీ సమన్వయం ఎలానో తెల్పాడు తూలికాభూషణ్.

— సంపాదకులు.)

# కోర్ట్ మార్షల్

## రామచంద్ర

### ౧

నీవు నన్ను మోసంచేశావు. అంది కండ్లెర్రజేస్తూ గురుముఖకౌర్.

................

నీవు మా జాతివాడవు కాకపోయినా, మా దేశంవాడవు కాకపోయినా నిన్ను ప్రేమించాను.

................

ఈ విషయం ఏ మాత్రం తెలిసినా, నా మనసుకు ఆఘాతం కలుగుతుందని ఊహించినా మొదట్లోనే ఊరుకుండేదాన్ని.

................

మౌనంగావుంటే మహా గొప్ప అనుకున్నావా?

................

విసిగిపోయాను మాటలన్నీ వింటూ. నే నేమైనా ప్రేమించమన్నానా? నాకు ఈమెను పెండ్లాడే ఉద్దేశమేలేదే ఎప్పుడూ. ఆడవాళ్ళవద్ద కొంచం చనువు, కొంత ఆత్మీయత కనపరిస్తే ప్రాణావికేవస్తుంది కాబోలు ననుకున్నాను.

నన్ను దేనికీ కాకుండాచేశావు।

ఇప్పటికి తప్పకుండా జవాబు చెప్పాలనివచ్చింది.

ఇదిగోచూడు గురుముఖ్। నేను నిన్ను ప్రేమించినమాట వాస్తవమే. కాని దాంట్లో ఏలాంటి శారీరక చింతాలేదు. నీవు నా ప్రవర్తనను అన్యధా భావించావు, భావిస్తూన్నావు।

అంతా వట్టి అబద్ధం.

నిజంచెబితే నమ్మవు: నిన్ను ప్రేమికులదృష్టితో ప్రేమించినానని చెప్పి. మోసంచేస్తే నిజమనుకుంటావు. అంతేనా?

...............

నా ప్రవర్తన నీకు ఇలాటి అభిప్రాయం ఎలా కలుగజేసిందో నాకే ఆశ్చర్యంగా ఉంది.

...............

ప్రేమికు డెవడో, ఏవిధంగా చూస్తాడో గ్రహించుకునేందుకు నీకు చేత కాకపోతే.

అంటే?

...............

స్త్రీకి అందులో నాకు ఇంతకన్నా చేతకాదనుకుంటావా?

...............

నిజంగా గుండెమీద చేయివేసుకొని నీవు మాట్లాడు. ఏమాత్రమూ నా ప్రేమకు ప్రోత్సాహం ఇవ్వలేదని!

లేదు—నిజంగా లేదు.

పురుషులు త్వరగా మనస్సు రాయి చేసుకుంటారు. ఒకవైపు ప్రేమకు ప్రాకులాడుతారు—మరోవైపు ప్రేమోపహారాన్ని నిర్దయగా తన్నివేస్తారు.

అన్యాయంగా దూషిస్తున్నావు.

నీ సంగతి గ్రహించలేదనుకున్నావా?

...............

మొదట్లో నా ప్రేమభిక్షకై ప్రాకులాడి. తీరావస్తే త లదన్నుతావా? నిప్పుతోనా చెరలాటం?

ఆమెవైపు చూడలేకపోయాను.

ఈ మార్పుకు కారణంకూడ నాకు తెలుసును.

మహారాజసింగ్........

నేను నిలువలేకపోయాను. ఇదంతా గ్రహించే నన్ను నిరాఘాటంగా విమర్శిస్తోందా ఈమె. కొంచం జంకుతూ తలెత్తి చూచాను. ఇప్పుడో అప్పుడో కన్నీళ్ళవర్షం కురిసేట్టు ఆమె కనురెప్పలు బరువవుతూన్నాయి. ఇంక తడవు చేయడం బాగుండదనుకున్నాను.

౨

ఇదిగో ఎక్కడికి, అన్నాడు. పోతూఉండె నన్ను చూచి ఆమె తండ్రి అక్షరసింగ్.

తలెత్తి చూచాను—ఎక్కుపెట్టిన మిషన్ గన్ లాగా తల ఎత్తి దండయాత్రకు ఎదురుచూస్తూన్నాడతను.

వస్తా, అన్నాను.

కొన్ని విషయాలు మాట్లాడాలి, అన్నాడు.

కోర్టుమార్షల్ కు సిద్ధంగా ఉండాలని గుండె దిటవుచేసుకున్నాను.

అవును నాయనా! నాకుకూడ మాట్లాడాలని ఉంది, అంటూ ఆయనభార్య అమృత్ కౌర్ వంటింట్లోనుంచి వచ్చింది.

ఉక్కిరి బిక్కిరి అయిపోయాను. విధిలేకుండా కాళ్ళీడ్చుకుంటూ గదిలో కూర్చున్నాను.

కొంతసేపు మౌనం నాట్యమాడింది గదిలో.

ఎంతపని జరిగింది నాయనా, అంది అమృత్ కౌర్ నిశ్శబ్దాన్ని భేదిస్తూ.

................

అమ్మాయి కుమిలి కుమిలి వాడిన సంపంగిరేకులా అయిపోయిందే చూచావా!

ఎడతెగకుండా కండ్లనీలాలు కురిపిస్తే ఏమైనా లాభం ఉంటుందంటావా ?

...............

ఎక్కడివాడవో ఏమో, మా మనస్సుల్లో నాటుకుపోయావు నీవు.

భరించలేకపోయాను. పీక్కుకూడ పసిపట్టి ఏడ్పించదలచారా నన్ను.

ఏం ? పలుకవు నాయనా ?

ఎందుకు మీ రిలా అంటున్నారో తెలీకుండా ఉంది.

...............

నే నేంచేశానని ?

మా ఇద్దరి సంభాషణవింటూ అక్షరసింగు ఉరిమిచూచాడు.

నా భావాలు........

నాకు బాగా తెలుసు. నా ఆశపై బూడిద చల్లావు. అన్నాడాయన రుద్ధ కంఠంతో.

...............

ఏమేమో అనుకున్నాను.

...............

నాకు అండగా ఉంటావనుకున్నాను.

...............

నా వంశాన్ని చిగిరింపచేస్తావనుకున్నా.

...............

ఆయన గొంతు బొంగురపోయింది. షాక్ కొట్టినట్లు లేచి చల్లగా జారుకున్నా. ఇదంతా నా అనాలోచితకార్య ఫలితమేనా ?

# 3

వెలుపల అడుగు పెట్టానో లేదో మహారాజ్ సింగ్ కనుపించాడు. ముఖం తప్పిద్దామని అనుకుంటూండగానే "భాయీ" అని పలుకరించాడు. వాడిన ముఖంతో "ఏమంత కంగారుగా ఉన్నావు" అన్నాడు.

నా ప్రయత్నమంతా వమ్మయిపోయింది.

...............

దురదృష్టం.

...............

ఎవరైనా మధ్య పుడకలువేశారేమో. అంటూ ఓ విధంగా చూచాడు నా వైపు.

వళ్ళు మండిపోయింది. నా మహాత్యాగానికి ఇదా మూల్యం. నా దగ్గర అంతగా ప్రాధేయపడ్డాడు. నీవు అడ్డంరాకన్నాడు. తన్నామె ప్రేమిస్తుందన్నాడు. ఇప్పుడు తన చేతకాక నామీద సందేహంకూడ చూపుతాడా ?

ఆమెవద్దకి వెళ్ళి ఎంతో ప్రార్థించాను.

...............

ఆ ముసలాళ్ళనుకూడా ఒప్పించాను.

...............

ఏమీ లాభించలేదు.

...............

ఓమారు ఆమెకు సలహా........

ఆ పనికూడ చేయమంటావా, అన్నాను ఘాటుగా.

...............

నీకై త్యాగముచేసినా. ప్రేమవెల తెలసి. ప్రేమించి ప్రేమింపజేసుకో లేనివాడివి. ఇతరుల రాయబారంతో ఎంతకాలం బండిని నెడుతావు ?

...............

నా కేమిలేదుగాని ఆ అమ్మాయిని అన్యాయంచేశావు.

...............

ముసలితనంలో వారినికూడ బాధించావు.

నేనా. అన్నాడు తీవ్రంగా సింగ్.

కాక మరెవరు ?

నీవే!

నేను నిర్ఘాంతపోయాను.

నీవంత ప్రేమించినవాడివి నా కెందుకు దారిచూపావు. అన్నాడు.

...............

నిజంగా ప్రేమించేవుంటే అంత త్వరగా త్యాగంచేయగలవా?

వట్టి చచ్చువుకనుకనే.......

...............

నీ వన్నె చిన్నె మాటలకు బేలుపోయిన ఆ అమ్మాయిని ఏడ్పిస్తూ.........

ఆఁ.ఆఁ. అన్నాను.

ఈ దుఃఖానికంతా పునాదివి నీవే.

...............

నీవు ససేమిరా అనివుంటే ఈ పరిణామమే కలిగేదికాదు.

...............

ఆమెకు అయిష్టంగా పెండ్లాడుతాననుకో. నాకుమాత్రం ఏంసుఖం?

...............

ఎప్పుడూ ఏడుస్తూ నీపై బెంగపెట్టుకొని నన్ను వేపుకుతినదా?

...............

ఆమెను కష్టపెడితే నా జీవితం సుఖపడుతుం దనుకున్నావా?

...............

అందరినీ దుఃఖపెట్టి నీవుమాత్రం ఏమి బాగుపడుకుంటావు. అంటూ నిర్లక్ష్యంగా వెళ్ళిపోయాడు.



(ప్రేమగతులు ఊహాతీతాలు. వలచి వలపింపనేర్చితే ఫలితం ఆనందదాయకంగా పరిణమిస్తుంది. వలచి వలపింపలేనిసమయంలో ఫలితం అతిదారుణం. ఈ సత్యానికే యీ కథలో చక్కని రూపంయిచ్చాడు రామచంద్ర. రచనలోని కొత్త పోకడలు ప్రశంసనీయాలు. — సంపాదకులు.)

# భారతీయ సంగీతం

## వెంకటాచార్య

"సంగీత పారిజాత" గ్రంథకర్త అహోబలశాస్త్రి మంగళాచరణ శ్లోకంలో ఒకచోట ఈలా అన్నారు. ఆర్యావర్తంలో అగ్నిహోత్రాది కర్మలుచేసి ధర్మార్థ కామమోక్షములనే చతుష్టయాన్ని పొంది జనులు ఏలా సంతృప్తి చెందుతారో ఆదేవిధంగా మహా విద్వత్తుతో కూడుకున్న ఈ సంగీత సాధనచేకూడ ముముక్షత్వం పొందగలరు.

ఈ విషయం సత్యాన్ని నిరూపిస్తుంది. సంగీతము సామవేదజనితము. ఈ సంగీతంద్వారానే ఈశ్వరునిమూర్తి ప్రతిబింబితమైంది. ముక్తకంఠంతో దేవాసురులు పురుషోత్తముని సంగీతంద్వారానే స్తుతించి తరించారు. ఈ సంగీత సాధనచే మహాయోగులు యోగానుష్టానాన్ని జరిపి సిద్ధి పొందారు. ఇదే భగవానుని స్వరూపం. ఇందువల్లనే ఇది సమస్త ప్రాణికోటికి అవిచ్ఛిన్నతారూపంతో పరివ్యాప్తితమై వుంది.

వేదకాలంనుంచీ ఈ సంగీతానికి రూపురేఖలుదిద్ది, స్వరాలేర్పరిచి, సుస్థిరత్వాన్ని చేసి లోకరంజనంగా చేయటానికి ఎన్నివిధాలో పాటుపడిన పూర్వీకులు చిరస్మరణీయులు.

ఇటువంటి పరిపూర్ణతనొంది, మానసికానందాన్నిచ్చే సంగీతం రానురాను అవమానకరమైన భోగేచ్ఛలకీ, లౌకికానందానికి గురిఅయింది. ఈ వికారాన్ని పోగొట్టి సంగీతాన్ని పూర్వోన్నతికితెచ్చి మధురంగాను, మనోహరంగాను, ఆకర్షణీయంగాను చేయటానికి సంగీత కళోద్ధారకులు ఉద్భవించి సేవచేయకలిగారు.

సంగీతం సామవేదజనితమని ఇదివరలో ఉదహరించా. ఈ సామవేదం బహుకూలంకషంగావుండి అందరికి అందుబాటులో వుండకపోటంవల్ల

ప్రయోజనంగా వుండేలాగ అనేక గ్రంథాలు వ్రాయబడ్డాయి. కాలానుసరణవల్ల వాటిలో చాలాభాగాలు లుప్తమయ్యాయి. అందువల్ల కొన్నిటి పేర్లుమాత్రమే నిల్చినై. భరతాది మునిప్రణీతమైన గ్రంథా లెన్నోవున్నాయి. వీట్లలో మాతంగ ముని బృహద్దేశి, నారద విరచిత సంగీత మకరంద, పార్శ్వనాథుని సంగీత సమయసార, లోచనకవి వ్రాసిన రాగతరంగిణీలు విఖ్యాతమైనవి. వీటికి ఇంకా పూర్వం గ్రంథాలున్నట్లు ఇతరత్రా గ్రంథకారులు ఉదహరించారు. వీట్లలో కోహళీయము, అష్టసేనీయము, సోమనాథీయము, స్వర రత్నావళి, సాహిత్య దర్పణము, హరిపాలీయము, సాహిలి, శృంగారతిలకము, రసరత్నప్రదీపిక, సంగీత సూర్యోదయం మున్నగునవి.

క్రీ॥ శ॥ 13 వ శతాబ్దంలో ఉత్తరాదిని దక్షిణాన్ని ఇద్దరు సంగీతవేత్తలు వెలిసారు. ఒరిస్సాప్రాంతంలో జయదేవుని కీర్తి ప్రజ్వరిల్లింది. ఆయన గీత గోవిందములో అనేక రాగతాళాల్ని సమన్వయించి రాధామాధవుల శృంగార విలాసముల అభివర్ణించారు.

దక్షిణాన్ని సా ర ం గ దే వు డ నే విఖ్యాత సంగీతశాస్త్రజ్ఞుడు వెలసాడు. ఈయన రచించిన సంగీత రత్నాకరమనే గ్రంథము అనేక పండితులకు భిక్ష పెట్టింది. దాన్ని ఆధారంచేసుకుని అనేక గ్రంథాలు వెలిసినై. ఏ పండితుని ముఖతా చూసినా ఈ ఉద్గ్రంథప్రమాణమే వెలువడుతూ ఉంటుంది.

సారంగదేవుని పూర్వీకులు కాశ్మీర బ్రాహ్మణులు. వలసవచ్చి దేవగిరిలో స్థిరనివాసం ఏర్పరుచుకున్నారు. అప్పటి దేవగిరి పాలకుడు యాదవ వంశీయు డైన రాజ సింఘన్న. సారంగదేవుని రత్నాకరంలోని విశిష్టత పై ఉదహరించిన ఉత్కృష్ట గ్రంథాలలోని సారాంశాన్నంతా తన గ్రంథంలో ఇమిడ్చి దాక్షిణాత్య సంప్రదాయానికి లాక్షణిక పద్ధతుల నేర్పరచడమే.

సంగీత రత్నాకరానికి విపులవ్యాఖ్య మల్లినాథుడు వ్రాసాడు. రేచర్ల వంశీయుడైన సింహభూపాలుడు తన కాలంనాటి విద్వాంసులతోటి ఈ శాస్త్రాన్ని శోధించి, సంప్రదించి ఒక గొప్ప పీఠికతో సంగీత రత్నాకరానికి నవీనత

పేర్పరిచాడు. ఇదే గ్రంథం వెంకటమఖి విరచిత చతుర్దండి ప్రకాశికకూ, తంజా పురి మహారాజా తులజా వ్రాసిన సంగీత సారామృతానికీ దారిచూపింది.

భారతీయ సంగీత మనగానే అనేక సందేహ పరంపరలను తావిస్తుంది. సంగీతంలో ఔత్తరాహిక దక్షిణాత్య భేదాలేమిటి? మార్గదేశీయ సంగీతాలేమిటి? భజనసంగీతానికీ కీర్తనలకూ భేదమేమిటి? హార్మోనియం అనుకరణానికి తగిన వాద్యమా కాదా? ఫిలిం మ్యూజిక్ శాస్త్రీయ సంగీతానికి దెబ్బపెట్టా? ఇలాంటివే ఇంకా ఇంకా ఎన్నో!

దక్షిణాది సంగీతానికి చతుర్దండి ప్రకాశిక ప్రమాణగ్రంథము. దీనిలోని 72 మేళకర్తలమీద ఆధారపడి జనకజన్యరాగాలుద్భవించాయి. శ్రవణోపేంద్రియమైన రాగాలు అంతరింద్రియాలని రేకెత్తించే అద్భుత శక్తి కర్ణాట సంగీతానికి వుంది. ఈ రాగాలకుండే విశుద్ధత ఇతరప్రాంతాల లేదనే ఖచ్చితంగా చెప్పవచ్చును.

మొదట్లో సంగీతశాస్త్రం యావద్భారతదేశానికీ ఒకే కట్టుమీద వుండేది. కాని రానురాను, విభిన్న సంస్కృతులవల్లా దూరభారాన్నిపట్టీ దక్షిణాదినివుండే సంగీతంలోని విశిష్టత ఉత్తర భూభాగం నిలుపుకోలేకపోయింది. కాని అంత మాత్రంచేత ఉత్తరాది సంగీతానికి విచ్ఛిన్నతలేదు సరిగదా స్వతంత్రత హెచ్చి తమ పద్ధతిలో రాగానికి గమకాన్ని మాధుర్యాన్ని పెంపొందచేసుకుని అనన్య సామాన్యమైన కీర్తి భారతీయ సంగీతానికి తెచ్చిపెట్టారు.

సంయుక్తరాష్ట్రంలో ప్రచారంలోనున్న సంగీతంలో స్వచ్ఛతా, సమైక్యతా, రాగాధిక్యం కనబడుతూంటుంది. దానికి కారణం అయోధ్య నవాబులు సంగీతానికిచ్చిన అఖండ స్వాగతమే. మహారాష్ట్ర సంగీతం ఉత్తర దాక్షిణాత్య కలయికకు ఒక మాదిరిగా అంకురార్పణ చేసిందనవచ్చు.

దక్షిణాదిన సంగీత మాధుర్యాన్ని వెదజల్లి ఆధ్యాత్మికభావాన్ని పెంపొంద చేసిన మహనీయుల్లో ముఖ్యంగా పేర్కొదగ్గవారు త్యాగరాజస్వామి, శ్యామా శాస్త్రి, దీక్షితులు. సంగీతంతోపాటు సాహిత్య రచనాసామర్థ్యం చూపి నృత్య

నవస్ఫూర్తిని తరహా తరహాలుగా నడిపించినవారు నారాయణతీర్థులు, పురందర దాసు, క్షేత్రయ్య, గోపాలకృష్ణభారతి మొదలయినవారు.

దక్షిణాదిని ప్రాథమికంగా ఘన, స్వరజతుల మొదలుకొని తానవర్ణాలు, కృతులు, రాగమాలికలు, పదములు మొదలగు క్రమపద్ధతులతో సంగీతవిద్యా బోధనాభ్యాసాలు జరుగుతవి.

ఉత్తరదేశాన్ని మీరాబాయి, నర్సింగ్ మెహతా, కబీరు మున్నగుభక్తులు భక్తిభావానికి ఎక్కువ తావుఇస్తూ సంగీతంలో ఆనందరసానుభావం కలుగజేసారు.

సంగీత గ్రంథాలయిన నాట్యశాస్త్రమూ, సంగీత రత్నాకరమూ ఉత్తర దక్షిణ సంగీతమార్గములకు సమాన ప్రమాణగ్రంథములు. కొన్నిచోట్ల ప్రస్తుత ఆచరణలో రాగతాళాల సన్నిహితంకూడా గమనించకలుగుతాం. కాని ఎత్తు గడలోనే వేర్వేరు పోకడలు గోచరిస్తాయి. దీనికి కారణం, ఔత్తరాహికులు శృతి లయమందు, రక్తి రంజకత్వం కనుపర్చారనీ వాణీవిశుద్ధతకు దక్షిణాదివారు తాళ లయాన్ని ఆశ్రయించారను ఒక జనాభిప్రాయం దేశంలో వుంది. కాని ఇదికూడా ఒక పొరపాటేమో అనిపిస్తుంది. ఉత్తరాదివారు శృతి, తాళ, లయాన్ని సమదృష్టితో చూచి, సంపూర్ణత్వంతో సంగీత రసవృష్టిని గురిపించి శ్రోతలను సమ్మోహితుల చేస్తారుకాని మొత్తంమీద భేదం నాకు అవగతమైనంతవరకూ ఉత్తరాదివారి అందుగడ పూర్వాంగంలోనే మొదలౌతుంది. పోగా పోగా జంఝా మారుతంలాగ అంతమొందుతుంది. అందువల్ల తోడ్తోనే, వారి సంగీతంలోని దానమూ మార్దవమూ వినేవినంగానే మనలను హాయి హాయి మనిపిస్తుంది. దానికి వ్యతిరేకంగా చాలామంది కర్ణాట సంగీతవిద్వాంసులు ఉత్తరాంగం (హెచ్చుస్థాయి) లో పాడ్తారు. అందువల్ల వారి గానము రక్తికట్టేటందుకు కొంత వ్యవధి కావలసివస్తుంది.

హార్మోనియం హైందవ సంగీతానికి ఉపకారమూ అపకారంకూడాచేసింది. ఉపకారమెల్లా అంటే సరిగమల ధ్వని ఆసేతు హిమాచలపర్యంతమూ, ప్రతి ఇంటిగడపలోనూ స్థావరంచేసింది. కాని స్వతఃసిద్ధమైన రాగానికి ప్రాణమైన నాదకౌశలము మూర్ఛనాది విశేషాలూ ఈ వాయిద్యంవల్ల నశించిపోయినై.

భజన సంగీతానికీ, గజల్ పాటలకూ స్వరసంవాదనశక్తి కలిగించేధ్వని కావాలి. ఆ పని తప్పక హార్మోనియం చేస్తుంది. ఇంతేకాక చిన్నపిల్లలకు శృతిజ్ఞానం ఓ విధంగా హార్మోనియం కలుగచేస్తుంది.

రాగరాగిణీలనే వ్యక్తీకరణం ఒక హిందూస్థానీలోనే వుంది. ఇదికూడా పేరుకుమాత్రమేకాని వ్యవహారంలో భేదం ఏమాత్రం చూపబడదు. దేవతామయ రూపం చిత్రలేఖనం నాదమయరూపం సంగీతం. దేవతకి ప్రస్థానం రూపకంలో ఏలా చూపెట్టబడిందో అల్లాగే హైందవ సంగీతానికి దేవత్వం ఆరోపించి ఆయా రాగాలకు అధిష్టానదేవతల నిర్మించి ఆయా చిత్రాలని చిత్రకారుడు మన కళ్ళ ఎదుట ప్రదర్శించాడు. చిత్రకారుని దృష్టిలో సంగీతమందలి రసగ్రహణకుగాని, లేక ఆనందరసానుభావం ప్రేక్షకులకు కలుగచేయటానికిగాని ఈ రంగులలో ప్రదర్శితమైన చిత్రలు గీయటానికి కారణమైవుంటుంది. వీట్లనే రాగమాల చిత్రాలంటారు. ఇదివరకు "భారతి"లో కొన్ని ప్రచురితమై వున్నాయి. వేరే చిత్రాల్లోవుండే అపరోక్షతా, భావమయతా వాట్ల వుండక రాగంలోవుండే రసపోషణ, సమయం, సంచాలనము మాచేచూట్టంతోటే విశదమౌతాయి. ఉదాహరణకు మల్హారిరాగం చిత్రంలో ప్రతిబింబితమౌటం చూస్తే ఆ సమయ స్ఫురణ, నేర్పు ఎంతయినా వర్ణనాతీతం. మేఘావృతమైన ఆకాశం, గాలి దుమారం, చిటపట చినుకులు. ఒక హర్మ్యంలోంచి నాయిక తన మనోహరుని రాకకు ఆందోళతాయత చిత్తంతో, అరమూర్పు కన్నులతో చూస్తూవుంటుంది. ఇది దృశ్యం. మేఘమల్లార, వాయిద్యంలోగాని గాయనంద్వారాగాని వింటోంటే పై వివరణమే కళ్ళకు కట్టుతుంది.

1798 లో రాగమాలిక అనే గ్రంథాన్ని గంగాధరుడు వ్రాసాడు. దాన్లో హనుమంత మతమనే సంగీత సిద్ధాంతాన్ని విశదీకరించి ప్రఖ్యాత గాయకుడైన తాన్‌సేనుకి జోహారు లర్పించాడు. తాన్ సేను పాడిన రాగములే ఇప్పటికి ప్రమాణంగా వున్నాయి. కాబట్టి ప్రస్తుత హిందూస్తానీ సంగీతం దాని అనుకరణమనే చెప్పవచ్చు.